# దేవుడికి ఉత్తరం

వి ఎస్ రమాదేవి





ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

# అంకితం

స్వర్గవాసి
పెద్దన్నయ్య
వడ్లపట్ల లోకరాజుగారికి

# పరిచయము

చిన్నకథ వ్రాయడం ఎంత సులభంగా కనిపిస్తుందో నిజానికంత కష్టంకూడానూ అబ్బాయి అమ్మాయి ప్రేమించుకోవడమూ మధ్యలో ఏవోఅడ్డంకలు రావడమూ కొసకు విడిపోవడమూ సర్వసాధారణంగా మనకథల్లో ఉండటం కద్దు అథవా వాళ్ళిద్దరూ పెళ్ళాడటమె జరిగితే చాలాకథల్లో ఆ దాంపత్యం నానాఅగచాట్లూ పడితీరుతుంది

ఈరకమైన కథలు మనకు చాలావున్నాయి నిజానికిది వాస్తవికమే అయినా చెప్పేవిధానంలో నాజూకుతనంలేకపోవడంవల్ల చాలాపేలవంగా కనపడుతుంటాయి

నామట్టుకు నేను మంచి చిన్నకథకు రెండు ముఖ్యలక్షణాలుండా లనుకుంటాను విషయం చెప్పేవిధానం ఈ రెండింటిలో ఏది లోపించినా చిన్నకథ విధిగా దెబ్బతినితీరుతుంది

విషయసేకరణకు నిశితమైనదృష్టి చాలాఅవసరం అనునిత్యం మనచుట్టూ జరుగుతున్న సంఘటనలెన్నో సాహిత్యంలోకి రాకుండానే నశించిపోతున్నాయి చిన్నకథకు ఆకలి ప్రేమ దరిద్రం నిరుద్యోగం మాత్రమే సరయిన విషయాలనుకోవడంకూడా తప్పే! ఏవిషయం కానీయండి వ్రాయగలగాలేగానీ దాన్ని అద్భుతమైన చిన్న కథగా రూపొందించవచ్చు

ప్రతిసంసారంలోనూ మామూలుగా జరిగేవిషయాలను తీసుకొని మునిమాణిక్యంవారు చక్కని కథలు ఎన్నోవ్రాశారు వ్యక్తి అంతరాంతరాల్లోజరిగే సంఘర్షణలను కథల్లోకి మలచి అందించగలిగారు శ్రీ గోపీచంద్ సమాజం అంగీకరించని భావాలను సంఘటనలను తీసుకొని చలంగారు అద్భుతమైన చిన్నకథలు ఎన్నోవ్రాశారు

దీన్నిబట్టి తేలుతున్నదేమిటంటే చిన్నకథకు ఎనికిరాని సంఘటనంటూ ఏమీలేదని మంచివిషయం లేదండీ! అంటుంటారు కొందరు ఇది రచయితయొక్క దౌర్బల్యానికి చిహ్నం సంఘటనలను తీసుకోగల శక్తి ఆ రచయితలో నశించిపోయిందన్నమాట అటువంటివారే పాత విష

యాలను పాతదృక్కోణంనుండిచూసి చాలాపాతకథలు వ్రాయడం జరుగుతోంది

ఎంత మంచివిషయంగానీండి దాన్ని అభివ్యక్తీకరించే విధానంలో శిల్పంలేకపోతే విషయప్రాధాన్యంకూడా నశిస్తుంది కేవలం శిల్పానికె ప్రాధాన్యమివ్వాలని నేనూ అనను కానీ శిల్పదృష్టిని విడిచిపెట్టినప్పుడు రచయిత ఏ ఫలితాన్నీ ఆశించకూడదు ఆలా ఆశించడం అన్యాయం కూడా అవుతుంది

రమాదేవిగారికథలను ఈ రెండుదృక్పథాలతోనూ నేను చదివాను తనకథలకు కావలసినవిషయాలను ఎన్నుకోవడంలో ఈమెగారు అవలంబించిన విధానం వినూత్నమైంది అత్యంత సహజమైన విషయాలను ఎన్నుకోవడమేకాకుండా వాటిని కథకరించడంలోకూడా వీరిపద్ధతి చాలా కొత్త కేవలం మొదటినుండి చివరిదాకా చదివించగలగడమే చిన్న కథ ప్రయోజనంకాదు అలా చదివించగలగడం అన్నది దానికున్న కనీస అర్హత ఆతరువాత అది సాధించే ఫలితమంతా లాభం అన్నమాట

ఈదృష్ట్యా రమాదెవిగారు చాలా లాభం సంపాదించుకొన్నారు ఇందులో ఏ ఒక్క కథనుగురించి చెప్పాలనుకున్నా ఎంతో చెప్పవలసి ఉంటుంది ఎక్కడికి పోస్టుచేయను? దేవుడికి ఉత్తరం? జాలి పడటంలేదుగదా ఇలా వ్రాసుకుంటూపోతే ఉన్న కథలన్నింటినీ ఇక్కడ ఉదహరించవలసిఉంటుంది

మీ కథేమీ బాగాలేదండి! అని మీరెప్పుడైనా ఏకథకునితో నైనా అనిచూడండి వెంటనే ఆ కథ ఎంతగొప్పదో మీకు Explain చెయ్యడానికి నానాతపనా పడతాడు అతను

ఈమాటె నే నోసారి రమాదేవిగారితో అన్నాను అవును నిజంగా ఆ కథ చాలా పేలవంగాఉంది అన్నారు ఆమె

అలా నిజాన్ని ఒప్పుకోగల ధైర్యం జీవితంలోనేకాకుండా వారి రచనల్లోనూ ఉంది చదివిచూడండి

శ్రావణ శుద్ధపాడ్యమి
హైదరాబాదు

రావూరి భరద్వాజ

# నా మాట

'నిజం నిష్ఠూరం' మరి రెండు కథానికలు పది పదకొండేళ్ళక్రితం నా పద్నాల్గు పదిహేనేళ్ళ వయస్సులో వ్రాసినవి అవి అప్పుడే పత్రికలలో ప్రచురితమయ్యాయి 'జాలిపడటం లేదుకదా' మరి ఒకటి రెండు కథానికలు మాత్రం ఇటీవలి రెండేళ్ళల్లో వ్రాసినవి మిగతావన్నీ అయిదారేళ్ళక్రితం వ్రాసినవి కాకపోతే అవి ఇటీవలే పత్రికలలో ప్రచురితమయ్యాయి చాలావేళ్ళ ఎడంలో వ్రాయడంవల్లనేమో కథానికలన్నీ ఒకస్థాయిలో ఉన్నట్టుగా అనిపించవనుకుంటాను ఈ కథానికలన్నిటినీచేర్చి పుస్తకరూపంలో ప్రచురించమని ప్రోత్సహించి శ్రమ అనుకోకుండా పరిచయంకూడా వ్రాసయిచ్చిన భరద్వాజగారికి నా కృతజ్ఞతలు

—రమాదేవి

# ఇందులో

# దేవుడికి ఉత్తరం

అయిదేళ్ళ సుశి ఇంచుమించు తన ఈడు పిల్లే సీత చేయి పట్టుకుని మంచి ఉషారుగా పరుగెత్తుకొచ్చింది ఇంటికి చూస్తే ఇంటికి తాళం వేసుంది ఒక్కసారిగ బిక్కముఖం వేసింది

'మా యింటికి రా మా అమ్మతో చెబుదాం'' అని సీత సుశిచేయిపట్టుకు లాగింది

ఇంటికి తాళం వేసిఉన్నా నోటికి తాళం వేసుకోలేనంత సంతోషంగా ఉన్న సుశి సీతతో పాటు పరుగెత్తింది రెండిళ్ళ అవతల వున్న సీతఇంటికి

సీత గేటు తెరుచుకుని 'అమ్మా మరే అంటూ గబగబా హాలులోకి పరుగెత్తింది

అమ్మా'' అని తనకుకూడ నోటిదాక వచ్చి నోరు తెరుచుకుని అలాగే ఉండిపోయింది సుశి

'అమ్మా మరే నాకు సుశికి డబుల్ ప్రమోషన్ వచ్చిందే మేం మూడోక్లాసులోకి వచ్చేశాం మా యిద్దరికే వచ్చిందే సుశి ఫస్టు నేను సెకండు'' అని ఒగుర్చుకుంటూ గట్టిగా ఊపిరి పీలుస్తూ చెప్పింది సీత

'మా అమ్మే!'' అంటూ సీత బుగ్గమీద ముద్దు పెట్టుకుంది తల్లి ఎదురుగా తెల్లబోయి చూస్తూ నుంచున్న సుశిని చూస్తే సీతతల్లికి ఎక్కడలేని జాలి పుట్టుకొచ్చింది సుశీ రా తల్లీ! నా దగ్గరకు రా అమ్మా'' అని చేతులు చాచింది

కొద్దిగా పంకోవిస్తున్నట్టుగ అడుగులు బరువుగా వేస్తూ దగ్గరకు వెళ్ళింది

సుశీతలని ముద్దుపెట్టుకుని 'నీకు వస్తావచ్చిందా మా సుశీ ఎంత తెలివైందని" అంటూ ముద్దుచేసింది సీత తల్లి మీ అమ్మెవుంటే ఎంత మురుసుకునేదో అనుకుంది లోన సీతతల్లి

'అమ్మా ఇకే సుశీవాళ్ళింటిం తాళంపెట్టి వుందే " అంది సీత తల్లి గొంతు సెలుకుచుట్టుకుని

'వుంటే ఏం మనింటికా వుంటుంది చక్కగా ఇద్దరూ ఉప్మా తిందురుగానుండండి" అంటూ వంటగది లోకి వెళ్ళింది సీతతల్లి

ఉప్మా తింటోందేకాని సుశీక ఎదో దిగులు వేసింది ఇంటికి వెళ్ళిపోవాలనిపించింది అందుకని ప్లేటులోది గబ గబా తినేసి తన ఇంటికెం పరుగెత్తింది సీత వెనకనుంచి కేకేస్తున్నా వినిపించుకోకుండా

ఇంకా తాళంవేసేవుంది విడీలెక్కి పైచీడీమీద కూర్చుంది రెండుచేతుల్లో గడ్డంపెట్టుకుని ఏడుస్తూ అక్క కోసం ఎదురుచూస్తూ కూర్చుంది

ఇంతలో అక్క వనజ వచ్చింది కాలేజినుంచి సుశీని అలా చూడగానే వనజకు కడుపులో కెలికినట్టయింది అమ్మ లేని లోటు కొట్టొచ్చినట్టు కనపడింది కళ్ళల్లు రెంచుకొన ఏడుపొచ్చింది అయినా ఆపుచేసుకుని 'సుశీ అప్పుడే వదిలేశారా మీ బడి రిపోర్టిచ్చారా నీకు? అలా ఉన్నా వేం అమ్మా" అంది సుశీని లేవదీస్తూ

ఏం చెప్పకుండా వనజకాళ్ళను చుట్టేసుకుని వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది సుశి

'ఏమయిందమ్మా స్కూల్లో లోనికి పద చెబుదువుగాని" అంటూ తాళంతీసి లోనకు తీసుకువెళ్ళింది వనజ

కొంచెంసేపటికి అక్క ఓదార్పుకి తేరుకుని 'నాకు డబుల్ ప్రమోషన్ వచ్చింది చెబుదామంటే ఇంట్లో ఎవ్వరూలేరు " అంది సుశి

'నిజంగానా! నాన్నరాగానే చెబుదాం ఫస్టురాంక్ నీదేనా?" అంది వనజ సంతోషంగా

'ఊ నాదే సెకండేమో సీత కొచ్చింది "

'పోనీ ఇంటికి తాళంపెట్టిఉంటే సీతావాళ్ళింటిలో కూర్చోలేకపోయావా నే నొచ్చేవరకూ "

అక్కడికే వెళ్ళాం సీత నేను ఉప్మాకూడ తిన్నాం సీత వాళ్ళమ్మతో చెప్పింది తనకూ డబుల్ ప్రమోషన్ వచ్చిందని " అంది మళ్ళీ బిక్క ముఖంచేస్తూ సుశి

'నువ్వు నాతో చెప్పావుగా నాన్నగారొచ్చాక చెబుదాం" అంది వనజ సుశి మళ్ళీ తల్లిసంగతి ఎత్తుతుందేమోనని లోలోనే భయపడుతూ

'మరి మన అమ్మేది? అప్పుడు ఊరుకెళ్ళిందని చెప్పావుగా ఇంకా ఎప్పుడొస్తుందేమిటి?"

'వచ్చేస్తుందమ్మా తొందరగా వచ్చేస్తుంది నువ్విట్లా క్లాసులో ఫస్టుమార్కులు తెచ్చుకుని డబుల్ ప్రమోషన్లు తెచ్చుకుంటుంటే దబ్బున వచ్చేస్తుంది "

'ఊఁ ఏంరాదు మొన్న నాకు జ్వరంవచ్చినప్పుడు కూడా రాలేదుకాని, సీతం జ్వరంవస్తే వాళ్ళమ్మ నాన్‌రొట్టి పెట్టి పాలుఇచ్చింది కథలు చెప్పింది ” 'మరి సీతా వాళ్ళమ్మ ఊరుకెళ్ళలేదుగా ఇక్కడే ఉందిగా అందుకని నాన్‌రొట్టిపెట్టి పాలుఇచ్చింది మనఅమ్మ ఊరు వెళ్ళిందిగా ఇక్కడలేదుగా అందుకని నీకు నే నిచ్చాను ”

'నిన్నిమ్మని చెప్పిందా అమ్మ నాకు జ్వరంవొస్తే ”

'ఊఁ 'సుశీ అడిగినవన్నీ ఇయ్యి నే నొచ్చేవరకూ జాగ్రత్తగాచూడు అని చెప్పింది ' అంది వనజ గొంతులో వచ్చిన గద్గదాన్ని విశ్వప్రయత్నంతో అణచుకుంటూ

'ఇంకెప్పుడొస్తుందేంటి అమ్మ నువ్వెప్పుడూ అబద్ధాలు చెబుతావు నేను నాన్ననే అడుగుతాను ”అంది సుశీ

అప్పుడే ఆఫీసునుంచి వచ్చిన సుశితండ్రిచెవిని ఆ మాటపడి కాళ్ళుచేపుఁలయినా విడవకుండా అలాగే అక్కడ కుర్చీలో కూర్చుండిపోయాడు అంతవరకు అతి ప్రయత్నంతో కన్నీళ్ళు ఆపుకుంటూవచ్చిన వనజ తండ్రిని చూడగానే ఇక నిబ్బరంగా ఉండలేకపోయింది తమ్ముడు వసుదానిలా 'నాన్నా'' అని కళ్ళు పమిటకొంగుతో మూసుకుంది ఏడుస్తూ తండ్రి లేచివచ్చి ఇద్దరుపిల్లల్ని దగ్గరకు తీసుకున్నాడు

'అక్కా ఆకలిమండిపోతోందే ఏదైనా టిఫిన్‌పెట్టు'' అంటూ పదేళ్ళరాముడు బుజాన పుస్తకాలసంచీతో పరుగున వచ్చాడు తండ్రి అక్క చెల్లెలు అలా విచారంగా ఉండ

టం చూస్తే రామానికి ఎక్కడలేని విచారం ముంచు కొచ్చింది

'అన్నయ్యా నాకు డబుల్ ప్రమోషన్ వచ్చిందిగా అందుకని అమ్మ దబ్బున వచ్చేస్తుందని చెప్పింది అక్క" అని గబగబా తండ్రిచేయి తప్పించుకుని రాముదగ్గరకు పోయి అన్న చేయి పట్టుకుంది

తండ్రి కన్నీళ్ళు జేబురుమాలాతో ఒత్తుకుంటూ వీధి గుమ్మంవైపు వెళ్ళిపోయాడు వనజ టిఫిన్‌చేయడానికి వంటింటివైపు వెళ్ళింది

'అన్నయ్యా దబ్బునంటే రేపొచ్చేస్తుందా అమ్మ?" అనడిగింది సుశి

'అక్కయ్య ఊరికే చెప్పింది అమ్మ రాదు చచ్చిపోయిందిగా "

'అంటే?" అంది ఒకరేపునుంచి నిజంగానే అమ్మ రాదేమోననిపించింది 'అంటే అమ్మని ఆరోజు వాళ్ళు మోసుకు వెళ్ళిపోయారే అప్పుడు మనం అందుకేఏడ్చాం" అన్నాడు రాము చచ్చిపోవడం అంటే తాను చెప్పవలసిన అర్థం అవ్వాక టేకనుక

"కాదులే నీకు తెలియదు అమ్మ వచ్చేస్తానని చెప్పిందట అక్కయ్యతో" అంది మళ్ళీ సుశి

'నీఇష్టం నువ్వు నమ్మితే నమ్ము అక్కమాటలు నువ్వు చిన్నపిల్లవు ఏడుస్తున్నావని అలా చెబుతుందక్క "

"నువ్వు పెద్దాడివేమిటి"

"ఆ చూచుకో నే బూట్లుకూడా వేసుకున్నాగా"

"అయితే నేనూ చేసుకున్నాగా"

"అయితే నాకు పెన్నుంది నీకుందా?"

'నాకు పెన్సిలుందిగా"

'అదేమరి పెద్దవాళ్ళదగ్గర పెన్నులుకూడఉంటాయి చిన్నవాళ్ళకి వట్టిపెన్సిళ్ళే వుంటాయి "

'అయితే నేనూ అడుగుతానుండు నాన్నని పెన్ను కొనిపెట్టమని" అంటూ పరుగున వీధిగుమ్మంలోకి "నాన్నా" అంటూ పరుగెత్తింది సుశి

సూన్యంలోకి మాస్తూ నుంచున్న సుశితండ్రి "ఏవమ్మా సుశీ" అని చేతుల్లోకి తీసుకుని ఎత్తుకున్నాడు

నాన్నా మరి నాకు పెన్నుకొనిపెట్టవూ ' అంది తండ్రి కోటుజేబులోంచి పెన్ను తీస్తూ

'తప్పకుండానమ్మా" అన్నాడు తండ్రి

'నాన్నా నువ్వు కొనిపెట్టకపోతే రేపు అమ్మొస్తుందిగా అమ్మతో చెబుతాను" అంది బుంగమూతి పెట్టుకుంటూ

'ఓ అట్లాగే చెబుదువుగాని పదమ్మా అక్క టిఫిన్ వేస్తోంది తిందాం" అంటూ వంటింటిలోకి తీసుకొచ్చాడు

చాటలో ఉప్మారవ్వ పోసుకుని పురుగు రేమన్నా ఉన్న య్యేమోనని చూస్తున్న వనజనిచూసి "అక్కా, చూడు అన్నయ్య అంటున్నాడు అమ్మరాదని నువ్వు అబద్ధం చెప్పావంట నాకు" అంటూ ఫిర్యాదుచేసింది

"లేదమ్మా తప్పకుండావస్తుంది రేపు అమ్మకి ఒక వేళ జ్వరంవస్తే జ్వరంతగ్గాక వచ్చేస్తుంది మరి నువ్వు మారాంచేయకుండా చదువుకుంటే నీకు బిళ్ళలు బిస్కట్లు పెన్నులు పెన్సిళ్ళు అన్నీ తెస్తుందట" అన్నాడు తండ్రి సమాధానపరుస్తూ

'నేను మారాంచేయకుండా చదువుకుంటాను మరి అమ్మని దబ్బున రమ్మంటావా?"

'ఆ దబ్బున తీసుకొచ్చేస్తాను రేపు నే వెళ్ళ"

'అమ్మో నువ్వు కూడా వెళ్ళి రాకపోతే అమ్మలాగ"

'నేను తప్పకుండా వస్తాగా"

'పోనీ నాన్నా అమ్మనిరమ్మని ఉత్తరం రాసేయ్ సుశి ఏడుస్తోందని" అంది వనజ మూకుడ్లో రవ్వ వేసి గరిటతో తిప్పుతూ

"ఆ బాగా చెప్పావమ్మా ఇవాళే వ్రాసేస్తాను ఉత్తరం సుశికి డబుల్ప్రమోషన్ వచ్చేసింది వెంటనే వచ్చెయ్ అని"

'తిరుగొచ్చేస్తుందా మరి"

'ఆ వచ్చేస్తుందమ్మ నీకు అక్షరాలువచ్చుగా అందుకని దేవుడితాతయ్యా మా అమ్మని వెంటనే పంపేయ్ అని నువ్వుకూడ ఒక కార్డుమీద వ్రాసెయ్ దాంతో దేవుడుతాత 'నువ్వెళ్ళు పాపం సుశి నీకోసం ఏడుస్తోందట అని అమ్మని పంపేస్తాడు" అంది వనజ

'మరి అమ్మకి జ్వరంవచ్చినా పంపేస్తాడా?"

'ఆ జ్వరం నయమయిన వెంటనే పంపేస్తాడు" అంది వనజ నమ్మబలుకుతూ

సుశీ గబగబా తన పుస్తకాల అలమారు దగ్గరకు వెళ్ళి కాపీపుస్తకం తెచ్చి దాంట్లో 'దేవుడు తాతయ్యా, అమ్మని దబ్బున పంపు" అని వ్రాసింది

తండ్రి ఇక అక్కడ నిలవలేక 'ఇప్పుడే వస్తాను" అని బయటకు వెళ్ళిపోయాడు అటూ ఇటూ తిరిగి దుఃఖం దిగ మింగుకు రావడానికి

తండ్రివెళ్ళగానే వనజ సుశీని ఒళ్ళో కూర్చోబెట్టుకొని 'మంచిపాపవుగా నువ్వు ఉప్మా తినేసి ఆడుకో నువ్వు అస్తమానం అమ్మకోసం ఏడిస్తే అసలు దబ్బున రాదు ఇంకో అయిదురోజుల్లో నీ పుట్టినరోజు పండగ కదూ ఆరోజున అమ్మ తప్పకుండా వచ్చేస్తుంది అందాక నువ్వు చక్కగా ఆడుకోవాలి" అంది

అమ్మ రాకపోతే దేవుడితాతదగ్గిరికి నాన్నెళ్ళి తీసుకొస్తాడా అప్పుడు సీతవాళ్ళమ్మ దేవుడితాతదగ్గరకు వెళితే వాళ్ళనాన్న వెళ్ళి తీసుకొచ్చాడుగా "

'సీతవాళ్ళమ్మ దేవుడితాతదగ్గరకు వెళ్ళలేదమ్మా, వాళ్ళతాత ఇంకొకతాత బెజవాడలోనే ఉంటాడు మన దేవుడుతాత చాలాదూరంలో ఉంటాడు ఆకాశంచూడు" అని కిటికీదగ్గరకు తీసుకువెళ్ళి చూపింది వనజ

'అక్కడుంటాడా?"

'ఊ మేఘాలు తిరుగుతున్నాయి చూశావా వాటి వెనక ఉంటాడు నువ్వు ఉత్తరం వ్రాశావుగా అది

అమ్మకంపుతుంది బట్టలన్నీ పెట్టెలో పెట్టుకుని అమ్మ సిద్ధంగా ఉంటుంది అమ్మకి ఒక్కర్తికే అంతదూరంనుంచి రావడానికి భయంగా అందుకని నాన్న ఎల్లుండి వెళ్ళి అమ్మని తీసుకొచ్చేస్తారు'' అని నచ్చచెప్పింది

మూడవరోజు తండ్రి ప్రయాణమై వెడుతుంటే నాన్నా నేనూ వస్తాను నీతోపాటు అమ్మదగ్గిరికి'' అని మారాంచేసింది సుశీ

'నే తీసుకొస్తాగా తప్పకుండా చిన్నపిల్లల్ని ఆవూరు రానియ్యరు' అని నచ్చచెప్పి వెళ్ళిపోయాడు

ఆరోజు మరుచటిరోజు 'నాన్న అమ్మ ఇంకెప్పుడొస్తారు ఇంకెప్పుడొస్తారు'' అంటూ పదేపదే అడుగుతూ వీధిగుమ్మంలోకి ఇంట్లోకి తిరుగుతూ గడిపింది సుశీ

మధ్యమధ్యలో సీతావాళ్ళింటికి వెళ్ళి 'సీతా నేను దేవుడితాతయ్యకు ఉత్తరం వ్రాశాగా మా అమ్మని పంపమని మా నాన్న తీసుకురావడానికి వెళ్ళారు అమ్మ వచ్చేస్తుంది మా అమ్మ బోలెడన్ని పెన్నులు చాక్లెట్లు తెస్తుందట మనిద్దరం పంచుకుందాము మా అన్నయ్యకివ్వొద్దు'' అంటూ ఎంతో సంబరపడుతూ ఏవేవో కబుర్లు చెబుతుంటే సీతతల్లి కళ్ళల్లో నీళ్ళు తిరిగేవి

'ఆ వచ్చేఆవిడ ఎలాంటిదొస్తుందో! పాపం చిట్టి పిల్లని బాగా చూసుకుంటే బాధఉండదు' అనుకుంది మనసులో

అరుగో మా నాన్న అమ్మ అంటూ వీధిలో టాక్సీ దిగుతుంటే గబగబా పరుగెత్తింది సుశీ తన ఇంటివైపుకి 'అక్కా అక్కా''అంటూ గట్టిగా కేకలుపెట్టి పిలిచింది

ఇంతలో తండ్రి తరువాత ఎవరో క్రొత్తావిడ దిగారు ఇంకా నెమ్మదిగా కారులోనుంచి ఎవరెవరో దిగుతున్నారు సుశి కేకలు విని ఇంట్లోనుంచి పరుగెత్తుకువచ్చిన వనజ సుశి మెడచుట్టూ చేతులువేసి దగ్గరగా తనకాన్చుకుని నుంచోపెట్టుకుని నెమ్మదిగా చెవిలో 'అదుగో నాన్న పక్కన నుంచుందే ఆవిడే మన అమ్మ అమ్మకి జ్వరం వచ్చిందికదూ అందుకని అలా అయిపోయింది అమ్మ ఎన్నోరోజులయిపోయింది కదూ ఆ ఊరువెళ్ళి అసలా ఊరువెళ్ళి అన్నిరోజులుంటే అట్లాగే జ్వరంవచ్చి మారిపోతారంట" అని చెప్పింది ఆ మాటలు వింటూ ఆ క్రొత్త అమ్మవంక అలాగే తెల్లబోయి చూస్తూ ఉండిపోయింది సుశి

# మరీ విపరీతం

"సుశీ చాల మంచిపిల్లండీ ఎంతో కలివిడిగా ఉంటుంది" అంది సరస్వతమ్మ కాఫీకప్పు అందిస్తూ భర్తతో

'ఏమిటి సంగతి! ముందు చాల చెడ్డపిల్లను కున్నావా?' అన్నాడు గంగారావు కప్పును అందుకుంటూ

'మీరు మరీను మొదటిసారివచ్చినప్పుడు మరీఇంత అనూయకమయిందనుకోలేదు!"

'రెండవసారి వచ్చినప్పుడు 'ఫరవాలేదు నేనే ఈ పిల్లని ఆడించవచ్చునూ అనుకుని ఉంటావు?"

'మీకెప్పుడూ వేళాకోళమే అదికాదండీ మొదటి సారి వచ్చినప్పుడు మూశాగుగా! ఏమిటో మునగదీసుకు కూర్చుంది ఏదయినా అడిగితే ముభావంగా సమాధానా లిచ్చింది"

'పాపం బేజారెత్తిందేమో తమ ఎడలెగని ప్రశ్నా వర్షంతో!"

ఏమీ బేజారెత్తలేదు కాస్త గర్వంగా అని పించింది"

'నీ కన్నీ అందరికీ అనిపించినట్టు అనిపించవు"

'గొప్ప పరిశోధనే నాకలా అనిపించినమాట నిజం, ఏవన్నా అనండి భోజనానికి రండి మీరూ, మీ అన్నయ్య

కలిపి అని మీరు పిలుస్తుంటే నా కంత ఇష్టంలేకపోయింది కూడాను "

'పోనీలే యిష్టంలేదని అక్కడే గొడవపెట్టి నా పరువు తీయలేదు "

'అవును పాపం, మీకో పరువంటూఉంది దానిని నేను తీసేయలేదు " అంది హేళనగా సరస్వతమ్మ

'పోనీ! నీవు మొదలుపెట్టిన సంగతేదో కానీ యీ యుద్ధంలో అస్త్రం నామీద ప్రయోగిస్తున్నావే" అన్నాడు రంగారావుగారు నవ్వుతూ

'మాటలు నేర్చినవారు మీతో నే నేం వాదించ గలను లెండి "

అవును నీతో వాదించగలగటంకాదుగదా! అసలు నీ నేదైనా అడిగితే సమాధానం చెప్పడానికి తబ్బిబ్బు పడాలి యక్షప్రశ్నలాయె మరి "

'బాగానేఉంది తిప్పికొట్టడం "

"ఆ! ఇంతకీ అకస్మాత్తుగా సుశీమీద అంత సదభిప్రాయం ఎందుకు కలిగింది దేవిగారికి" అన్నారు రంగారావు కనుబొమ్మల క్రిందనుండీ మరుసుగా చూస్తూ

'ఊరుకుందురూ నిజంగా పాపం చాలా అమాయకమయిందండి భోజనానికి వచ్చిందా పిల్లలతో చక్కగా కబుర్లు చెపుతూ కూచుంది నేను కాస్త ఎక్కువ అన్నం వడ్డిస్తే పాపం ఎహో యాతనపడింది తినడానికి "

'తమరి ముఖారవిందం చూశాక వదిలిపెట్టడానికి జంకిందేమో!"

"పాపం మహా మొహమాటం ఎల్లుండి మన పాప పుట్టినరోజుకదూ, టీకి రమ్మని పిలిచా"

'ఓ! చాలవరకు పెనవేసుకుంది ఆత్మీయత ఇద్దరి మధ్య"

మంచి మనుష్యులయితే ఆత్మీయత ఎంతలో పెన వేసుకుంటాయి" అంది సరస్వతమ్మ రంగారావుచేతిలో నుంచి ఖాళీకప్పు అందుకుంటూ

'సుశే కాదు నీవుకూడా చాలా మంచిమనిషి వేనన్న మాట!" అన్నాడు రంగారావు ఆమెకళ్ళల్లోకి కొంటెగా చూస్తూ

మూడోరోజు సుశి సరస్వతమ్మయింటికి వచ్చింది చేతిలో పారిస్ స్వీట్సు డబ్బాతో ఎదురుగా రంగారావు కనిపించాడు

'రా అమ్మా! రా! కులాసాగాఉన్నావా" అని పలక రించాడు రంగారావు

'బాగానేఉన్నానండీ అన్నయ్యకె ఒంట్లో బాగా లేదు" అంది సుశి

'ఏమయింది జ్వరమేమన్నా వస్తోందా?"

'అవునండీ రాత్రినుంచీ బాగా టెంపరేచర్ వస్తోంది నేను యివాళ రావద్దనుకున్నాను తనే బల వంతంచేసి పంపాడు"

కాస్త జాగ్రత్తగాఉండమ్మా! ఎవరైనా డాక్టరుకి కబురుపంపారా? రోజులు బాగ లేవు"

"పంపామండీ ప్రొద్దుట వచ్చారు డాక్టరు 'మామూలు జ్వరమే ఖంగారుపడక్కరలేదన్నారు" అంది సుశీ

ఇంతలో రంగారావుకూతురు అక్కడికి వచ్చింది

'చూడమ్మా! అక్కను అమ్మదగ్గరికి తీసుకెళ్ళు" అన్నాడు రంగారావు కూతురితో

సుశీచేతిని పట్టుకుని 'రా అక్కా! అమ్మ గదిలో ఉంది వెళదాం రా" అంది ఆరోజే ఏడోఏడు వచ్చిన సుజాత

'పాపా! ఇదుగో, నీకు బిళ్ళలిమ్మంటదూ! తీసుకో" అని స్వీట్సుడబ్బాను పాపచేతిలో ఉంచబోయింది

సుజాత ప్రశ్నార్థకంగా తండ్రివంక చూచింది

ఎందుకమ్మా ఇవన్నీ తీసుకో సుజాత లేకపోతే అక్కేమన్నా అనుకుంటుంది" అన్నాడు రంగారావు

సుజాత సుశీ లోనకు వెళ్ళారు రంగారావు డ్రాయింగురూములోనే కూచ్చుండిపోయాడు

వెళ్ళగానె 'ఎంతసేపయిందో వచ్చి" అంది సరస్వతమ్మ బట్టతో తుడుస్తున్న ప్లేటువంకే చూస్తూ

'అయిదు నిమిషాలయింది ఆయన డ్రాయింగు రూములో కనపడి పలకరించారు" అంది సుశీ

'అవును వినపడ్డాయి మాటలు ఎవరో అనుకున్నాను" అని సరస్వతమ్మ పెద్దకూతుర్ని కేకేసి 'చూడమ్మా టీ టిఫెనూ టేబుల్ మీదపెట్టు" అంది

"అమ్మా! నాన్నకికూడ పెట్టేస్తున్నాను తనుకూడ తీసుకోలేదుగా" అని ప్రక్కగదిలోనుంచి కేకేసింది పెద్ద కూతురు

సరస్వతమ్మ ముభావంగాఉంది ఎందుకో

సుశి 'వస్తానండీ" అంది లేస్తూ టీ తీసుకోవడం పూర్తవగానే

'అప్పుడే ఏమిటమ్మా! కాసేపు కూర్చో! ఇప్పుడేగా వచ్చింది" అని మర్యాదకుకూడ అనక తలఊప టేబులు మీాది ప్లేట్లు సర్దడం మొదలుపెట్టింది సరస్వతమ్మ

'వస్తానండి" అని రంగారావుకు నమస్కారంచేసి సుశి వెళ్ళిపోయింది"

క్రిందటిసారి వచ్చినప్పుడు పనిమనిషి చేత రిక్షా తెప్పించి రిక్షాఎక్కి వెళ్ళేవరకు ఎంతో ఆప్యాయంగా గుమ్మంలో నుంచుని పంపిన సరస్వతమ్మ ఈసారి ఎక్కడున్నది అక్కడే ఉండి పనిచూసుకుంటోంది రంగారావు భార్యముభావానికి ఎటూ తేల్చుకోలేక అలాగే కుర్చీలో కూర్చుండిపోయాడు నాలుగునిముషాలు నిశ్శబ్దంగా దొర్లిపోయాయి

'అమాయకమయిందనుకున్నాను చాల గడుసుదీ, తెలివైందీని" అంది అకస్మాత్తుగా సరస్వతమ్మ

'ఎవరూ?"అన్నాడు రంగారావు ఏదో ఆలోచిస్తున్న వాడల్లా

"ఇంకెవరూ? ఆ ఎర్లే మాట మాట్లాడటమే చేతగా నట్టుంటుంది నాదగ్గఅ మీాదగ్గర గంగాప్రవాహంలా కబుర్లు దంచేసింది"

'నేనే పలకరించాను సమాధానం చెప్పింది అంత మాత్రానికే చాలా తెలివయిందయిపోయిందన్నమాట నిమిషానికో అభిప్రాయం'

'అసలు మీతో ఆ పిల్లకు బుర్లేమిటి?''

'బాగానే ఉంది నీ గొడవ అందుకనేనా తమరలా మామూలు మర్యాదకూడా మర్చిపోయి పాపం ఆ పిల్ల వెళుతుంటే 'ఊ! ఆ' అనికూడ అనలేదు'' అన్నాడు రంగారావు కాస్త విసుగుగా

కాకపోతే మీతో మాటలూ, పోట్లాటలూ నవ్వులూ సాగించాలా! ఇక మర్యాదా లేదు మన్ననా లేదు మీతో జోక్యం పెట్టుకోనంతవరకే ఎంత మర్యాదైనా చేసేది'' అంది సరస్వతమ్మ ఒకపాటి బింకంగా

'నీది మరీ విపరీతం సుమీ ఆయన్ని వలలో వేసుకోవడమే ప్రతి ఆడదాని పనీను మరీ అర్థంలేకపోతే సరి'' అంటూ అక్కడినుంచి లేచి వీధిలోకి వెళ్ళాడు రంగారావు చిరాగ్గా

# జాలిపడటం లేదు కదా!

సుబ్రహ్మణ్యం నుంచున్నాడు స్టాఫ్ రూమ్ గుమ్మంలో కమ్మీ పట్టుకుని కొంచెం దూరంలో '[illegible] వైపుగా ఫిజిక్స్ లెక్చరర్ మూర్తితో కబుర్లు చెపుతూ నెమ్మదిగా అతని ప్రక్కనే నడిచి వెడుతున్న విజయ కనపడింది ఏదో మాటకు అతని వంక చూసి గట్టిగా నవ్వింది కూడా మధ్యలో విజయ

'ఈ మధ్యనే క్రొత్తగా వచ్చిన మూర్తితో అంతపరిచయం ఎక్కడిది విజయకి అంత చనువుగా ప్రక్కనే నడుస్తూ నవ్వుతూ వెళుతోంది అని ఆలోచనలో పడ్డాడు సుబ్రహ్మణ్యం అసలెందుకు అంత గట్టిగా నవ్వింది విజయ? తనకు వినపడాలనా ఒకవేళ తనని చూసే నవ్విందా? తప్పకుండా తనని చూసే హేళనగా నవ్వి వుంటుంది తానొకసారి 'మూర్తి అంత మంచివాడులా కనపడటం లేదు" అంటే 'లేదండీ మంచాయనలాగానే కనబడుతున్నాడు నాకు" అంది మొండిగా తనని ఏడిపించడానికే అలా తన ఎదుట అతనితో ప్రక్కనే నడుస్తూ వెళ్ళింది అనుకుని చికాకుపడ్డాడు లోలోన సుబ్రహ్మణ్యం

'ప్రిన్సిపాల్ గారెందుకో రమ్మంటున్నారయ్యా" అంటూ వచ్చాడు ప్యూన్ ఇంతలో

'ఈయనకీ ఇప్పుడే పనొచ్చిందే నాతో వి వేధవ ఉద్యోగం దరిద్రపు మనుష్యులు" అనుకుంటూ వెళుతున్న సుబ్రహ్మణ్యానికి లాన్ ప్రక్కనేఉన్న కాంటీన్‌లోనించి విజయనవ్వు వినపడింది నాలుగడుగులు ముందుకేయగానే విజయప్రక్కనే కూర్చున్న మూర్తి కనపడ్డాడు 'గాడ్ ఇక్కడా విక్కైనే అనుకుంటూ గబగబా ముందుకు నడి చాడు ఏదో చీదరనేసినట్టు అదే వూపులో గబాలున తలుపునెట్టుకుని ప్రిన్సిపాల్ గదిలోకి వెళ్ళాడు

'ఏం ఒంట్లో బావుండలేదా? అలా ఉన్నారు" అన్నాడు ప్రిన్సిపాల్ సుబ్రహ్మణ్యాన్ని చూడగానే

'ఏంలేదు కొంచెం ఒంట్లో నలతగావుంది ఏడాది కేడాది పైనపడ్డకొద్ది ఆరోగ్యం సరిగా వుండదుగా" అన్నాడు సుబ్రహ్మణ్యం తాను ప్రిన్సిపాల్ కంటె వయస్సులో పెద్ద వాడిననేది గుర్తు చేస్తున్నట్టుగా

సుబ్రహ్మణ్యం వయస్సులో తనకంటే పెద్దవాడని ఆ కాలేజీలో చాలాఏళ్ళుగా అనుభవం గలిగివున్నవాడని ఆమధ్యనే ట్రాన్స్‌ఫరయి క్రొత్తగావచ్చిన ప్రిన్సిపాల్‌కి గౌరవం ప్రతివిషయం సాధారణంగా సుబ్రహ్మణ్యంతో సంప్రదిస్తూఉంటాడు ముఖ్యంగా కాలేజిలో జరిగే ఫంక్షన్స్‌విషయంలో సుబ్రహ్మణ్యంసలహా తీసుకోకుండా ఉండడు ప్రిన్సిపాల్

'దేనికి పిలిపించిరి?" అన్నాడు సుబ్రహ్మణ్యం

'ఇందాక విజయ మూర్తి వచ్చివెళ్ళారు" అన్నాడు ప్రిన్సిపాల్

“ఓ గాడ్!” అనుకున్నాడు సుబ్రహ్మణ్యం లోన

“ఈసారి ఓల్డుస్టూడెంట్సు గాదరింగుకి మూర్తిరాసిన నాటకం వేస్తున్నారట సెట్టింగ్సుకీ వాటికీ మూటయాభై రూపాయలయినా అవుతాయట మీరేమంటారు?” అన్నాడు ప్రిన్సిపాల్

‘నేననేదేముంటుంది మీ యిష్టం కాని ఒక్క నాటకానికే మూటయాభై రూపాయలు ఖర్చుపెడితే మిగతా ఖర్చుమాటేమిటి డబ్బు సరిపోతుందా?” అన్నాడు సుబ్రహ్మణ్యం

‘అదే నేనూ అన్నాను విజయ ఒక్కతే డెలిగేట్ పాస్‌లతో మూడువందలకుపైగా పోగుచేసిందట మిగతా వాళ్ళంతా కలిసయినా కనీసం మరో మూడువందలన్నా పోగుచేసివుంటారట టీపార్టీకేమయినా కొద్దోగొప్పో తక్కువపడితే ఒకవేళ ఖర్చు ఎక్కువఅయి మళ్ళీ విజయ పోగుచేసి ఇస్తానంది” అన్నాడు ప్రిన్సిపాల్ సమాధానంగా

‘అయితే సరే ఇంతకీ మూర్తినాటకమే వేయాలని మాత్రం ఏముంది తక్కువఖర్చుతో అయ్యే నాటకాలకు కొరతలేదుగా మనకి” అన్నాడు సుబ్రహ్మణ్యం

‘మూర్తినాటకం స్టేజిమీద సులభంగా వేయడానికి వీలుగావుందట నా కాట్టే నాటకాలసంగతి తెలియదు మీరు చదివి చూడండి ఒకసారి” అన్నాడు ప్రిన్సిపాల్

‘దానికేముంది అతను బాగానే వ్రాసి వుండ

వచ్చు ఇంతకీ ఎవరెవరు వేస్తారట ప్రైజ్ దగ్గరకువచ్చింది కూడా" అన్నాడు సుబ్రహ్మణ్యం

'నాయికే కారక్టర్స్ వున్నాయట హీరోయిన్ విజయ హీరో సుదర్శన్ ఇంజనీరింగు కాలేజీలో పనిచేస్తున్నాడట మీకు తెలిసేఉంటాడు మీ ఓల్డు స్టూడెంటే నట మిగతా రెండూ ఇంకా ఎవరెవరో వేస్తారట" అన్నాడు ప్రిన్సిపాల్

ఓ అయితే అంతా నిర్ధారణ అయిపోయిందన్న మాట ఇక ఇప్పుడు నా అభిప్రాయంతో అవసరం ఏముంది? కానీయమనండి చిన్నవాళ్ళు ఉత్సాహపడుతున్నారు" అన్నాడు పైకి కృత్రిమంగా పెదవి విరుచుకుని నవ్వుతూ లేచి నిలబడి సుబ్రహ్మణ్యం

'మీ ఆరోగ్యం సరిగా చూసుకోండి" అన్నాడు ప్రిన్సిపాల్

'థాంక్స్ వస్తాను" అంటూ సుబ్రహ్మణ్యం తలుపు తోసుకుని బయటకువచ్చాడు కాంటీన్‌లో బహుశా విజయ మూర్తి కూర్చొని వుంటారేమో వాళ్ళిద్దర్నీ అలా కూర్చొని వుండగా చూడవలసివస్తుందేమోనన్న భయంతో అటువైపు వెళ్ళకుండా రెండోవైపునుంచి తెలుగు ఎగ్జామినేషన్ రూమ్‌ను దాటి నడుస్తున్నాడు తల వంచుకొని ఏదో ఆలోచించుకుంటూ సుబ్రహ్మణ్యం

'నమస్కారమండి" అన్నమాట విని తటాలున తల ఎత్తి చూశాడు సుబ్రహ్మణ్యం ఎదురుగా సుదర్శన్ గ్రేక్ రూమ్‌లో స్టేజీమీద రంగుల్లోవున్నప్పుడు ఎంత

అందంగా కనపడ్డాడో అంత అందంగానూ కనపడ్డాడు సుదర్శన్ నాటకంలో హీరోలా అతనిప్రక్కని విజయని హీరోయిన్‌గా అనుకోకుండానే వూహించుకున్నాడు సుబ్రహ్మణ్యం ఒళ్ళంతా మంటలు రేగాయి

'ఏమిటోయ్ సంగతి ఇలా వచ్చావ్?" అన్నాడు సుబ్రహ్మణ్యం

'విజయ కబురు పెట్టింది 'ఏదో నాటకంలో వేయాలి రమ్మని" అన్నాడు సుదర్శన్

'ఓహో మూర్తితో కలిసి కాఫీ తీసుకుంటున్నట్టుంది విజయ కాంటీన్‌లో మూర్తి నాటకం చాలా బాగా వ్రాశాడని అందట విజయ" అన్నాడు సుబ్రహ్మణ్యం

'అవునట అలాగే అంది విజయ నాకింకా కూడా నే నింకా చదవలేదు' అన్నాడు సుదర్శన్

"అంత ఖర్చుపెట్టి ఆ నాటకం వేయకపోతే మీ ఓల్డ్ స్టూడెంట్సు వ్రాసిన నాటకమేదైనా వేయొచ్చుగా"

"బహుశా ఆయన చాలా బాగా వ్రాసి వుండకపోతే విజయ ఆ నాటకం తీసుకుని వుండదు"

'మీ అందరికీ ఆమాత్రం నమ్మకం విజయలో వుంటే మంచిదే ఎక్కువ వైముకూడా లేదు సరిగ్గా వేయకపోతే క్రొత్తవాడుకనుక మూర్తి అపార్థం చేసుకోవచ్చు కూడా"

'మా శాయశక్తులా ప్రయత్నిస్తాం అక్కడికీ సరిగా నడవకపోతే ఎవరుమాత్రం చేయగలిగేదేముందండి

అయినా మూర్తిగారుకూడా అలా వేరేగా తీసుకోరను కుంటాను ”

“ఏం నీకుకూడా బాగా పరిచయమా అతను ?”

“లేదండీ క్రిందటేడు ఇంటర్ యూనివర్సిటీ డిబేట్ కాంపిటేష్‌న్సప్పుడు కలిశారు—అప్పటి పరిచయమే ”

‘సరే వెళ్ళిరా విజయ మూర్తి వెయిట్ చేస్తున్నారేమో నీకోసం ’ అని సుబ్రహ్మణ్యం గబగబా స్టాఫ్‌రూమ్ వైపు వెళ్ళాడు బి ఏ స్టూడెంట్స్ ఇద్దరు స్టాఫ్‌రూమ్ లోకి వస్తే ఇవాళ క్లాసు తీసుకోను ఒంట్లో అంత బాగా లేదు” అని చెప్పి పంపేసి,ఒక్కడే అంత పెద్దగదిలో కూర్చు న్నాడు కాసేపు

ఇంతలో తెలుగు లెక్చరర్ ప్రమీల వచ్చి “నమస్కారం మేష్టారు” అంది చేతిలో పుస్తకాలు బల్లమీద పెడుతూ

‘కూర్చోవమ్మా కూర్చో ఈ పీరియడ్ ఖాళీయా”

అన్నాడు సుబ్రహ్మణ్యం

‘అవునండి కనీసం నేనో యాభైరూపాయలైనాపోగు చేయాలంది విజయ ఇంక పదిరూపాయలు మాత్రమే తక్కువ ఫ్రెండ్సుదగ్గరికి వెళ్ళొద్దాం ఈ టైములో అను కుంటున్నాను ఇప్పుడే ’అంది ఎదురుగా కుర్చీలోకూర్చుంటూ ప్రమీల

“ఏమిటి భారీఎత్తున చేస్తున్నట్టున్నారే ఫంక్షన్”

‘ఈ కాలేజిలో చదివినవాళ్ళము చాలామందిమి ఈ వూళ్ళోని కాలేజీలలోనే లెక్చరర్సుమయ్యాము కదండీ! ఈ సంవత్సరం అందరమూ కలిసి సరదాగా చేద్దాం అను

కున్నాను ముందుముందు రొటీన్‌లోపడితే ఏం చేయలేక పోవచ్చుకదండీ"

'నిజమే నిజమే నాటకంకూడా వేస్తున్నారట దాన్లో నువ్వేమీ వేయడంలేదా?"

'లేదండి ఒక్కటే స్త్రీపాత్ర అది విజయ వేస్తోంది నాకసలే భయం స్టేజిఎక్కాలంటే ఎప్పుడో ఒక్కసారి కాలేజినాటకింలో విజయతోపాటు వేశాను పట్టుబలవంతం మీద"

'అయితేమాత్ర మేం దీన్లోనూ వేయొచ్చుగా విజయ వెయ్యమని అడగలేదూ మరి?"

'అడిగింది కాని నేనే వెయ్యనన్నాను నేనసలు వెయ్యలేనండీ"

'వెయ్యలేకపోవడానికి అంత బ్రహ్మాండం ఏముంది అసలు విజయ గట్టిగా అడగలేదేమో డబ్బు పోగుజేసే వరకు మీరందరూ కావాలి పేరు తనకి రావాలి చాలా తెలివైంది విజయ"

"మొదటినుంచి విజయ సుదర్శన్ ఎక్కువగా ఇల్లాంటి విషయాల్లో కలుగజేసుకునేవారుకదండీ అందుకనే ఈసారి కూడా ఈ విషయమంతా వాళ్ళకే వదిలేశామండీ!"

'పెత్తనం వాళ్ళికి వదిలినా పని మీరే చేస్తున్నా మగా ఇంతకీ మూర్తివ్రాసిన నాటకం నువ్వుచదివావా?"

'చదివాను బావుందండీ అయినా మనవాళ్ళని మనమే ప్రోత్సహించుకోకపోతే ఎలాగండీ"

'అదీనిజమే నువ్వుకూడా వ్రాస్తావుకదమ్మా

మూర్తిదే ఎందుకు వేయవలసివచ్చింది? అతను ఈ యూనివర్సిటీ స్టూడెంట్ కూడా కాదుగా ”

‘ఈ స్టూడెంట్స్ వ్రాసిన నాటకమే వేద్దామని నియమం పెట్టుకోలేదండ మూర్తిగారిది ఇంతవరకూ ఎవరూ వేయలేదు అందుకని విజయ అడిగి తీసుకుంది ”

‘పబ్లిష్ అయిందా?”

‘లేదండి మాన్స్‌క్రిప్టు తీసుకుంది మొన్న నాయన స్టాఫ్‌రూమ్‌లో కూర్చుని చివరిఅంకం వ్రాసుకుంటున్నారట విజయచూసి అడిగిపుచ్చుకుని చదివి నాకిచ్చింది, నన్నుకూడా చదవమని ”

‘అలా చెప్పు మూర్తికి విజయకి బాగా స్నేహం కలిసిందన్నమాట” అని అర్థయుక్తంగా నవ్వాడు సుబ్రహ్మణ్యం

“నమస్కారం సర్” అంటూ లోపలికి వచ్చాడు మూర్తి ఇంతలో

‘ఓ రావోయ్ కూర్చో ” అన్నాడు సుబ్రహ్మణ్యం

విజయ సుదర్శన్ బయట తలుపుకెదురుగా నిలబడి మాట్లాడుకుంటూ కనపడ్డారు సుబ్రహ్మణ్యానికి చూసీ చూడనట్టుగా అటేచూస్తూ కూర్చున్నాడు సుబ్రహ్మణ్యం మొత్తానికి ముగ్గురిలో ఎవరూ పెదవి మెదపలేదు విజయ సుదర్శన్ ప్రిన్సిపాల్ రూమ్‌వైపుకు వెళ్ళటం కనిపించింది ఇంతలో విజయ ఎందుకనో వెనక్కు తిరిగి ఏదో మర్చిపోయి

నట్టు స్టాఫ్ రూమ్‌లోకి వచ్చింది వస్తూనే 'నమస్కారమండీ'' అంది సుబ్రహ్మణ్యాన్ని చూసి

'ఆ ఆ రా అమ్మా కూర్చో ఏదో నాటకం వేస్తున్నారట?'' అన్నాడు సుబ్రహ్మణ్యం

'ఆ సంగతే చెబుదామని వచ్చానండి' అంది విజయ

'మీ సలహా కావాలండీ రిహార్సల్సవి మీరు చూస్తారని అనుకుంటున్నాం'' అన్నాడు మూర్తి

నా కెక్కడ కుదురుతుందోయ్ ఇంట్లో బాపుండ టంలేదు విజయ సుదర్శన్ వేస్తుంటే ఇంకా వేరే ఎవళ్ళు చెప్పాల్సిందేముంటుంది విజయ చాలా తెలివైంది అన్నీ తనే చూసుకోగలదు'' అని మూర్తితో అని 'ఏవమ్మా'' అంటూ ఒకమాదిరిగా కనుబొమల క్రిందనుండి నవ్వుతూ చూశాడు విజయవంక

ప్రిన్సిపాల్‌గారు రమ్మంటున్నారమ్మా'' అంటూ వచ్చాడు ప్యూన్

'ప్రమీలా నువ్వుకూడా రా బహుశా ఫంక్షన్ విషయం మాట్లాడటానికె అయివుంటుంది'' అంటూ ప్రమీలను తీసుకుని విజయ వెళ్ళిపోయింది

'కనీసం ఒక్కసారి నాటకం చదివి సలహాలేమైనా ఇస్తె మార్పులవీ చేస్తాను అవసరమయితే'' అన్నాడు మూర్తి

'ఫరవాలేదోయ్ మార్పుచేయాల్సిన అవసరమేమీ ఉండదు విజయ చదివించెమోకదా, ఏమంది?''

' 'ఈనాటకం మేం తప్పకుండా వేస్తాం అన్నారు'' అన్నాడు మూర్తి

ఓహో! అందుకనా 'ఎలాఉన్నా మనవాళ్ళని మనంఅన్నా ప్రోత్సహించుకోకపోతే ఎలాగ అన్న ఉద్దేశ్యంతో విజయ మూర్తిగారి స్క్రిప్టు తీసుకుంది అన్నట్టుగా అంది ప్రమీల'' అన్నాడు సుబ్రహ్మణ్యం కొంచెంగా నుదురు చిట్లించి తనకష్టంలేకపోయినా ఆమాట చెప్ప వలసివచ్చిందన్నట్టుగా కనుబొమల క్రిందినుంచి మూర్తి ముఖకవళికలలో ఏమైనా మార్పువస్తుందేమోనన్నట్టుగా పరీక్షగా చూశాడు కొన్నిక్షణాలు మూర్తి ఏదో ఆలోచనలోపడ్డట్టుగా కూర్చున్నాడు

'వస్తానోయ్ మూర్తి నాటకంవిషయంలో భయ పడకు సుదర్శన్ విజయ తోటీ అయితే బాగా నటిస్తారులే' అని మూర్తి భుజంతట్టి సుబ్రహ్మణ్యం కాలేజ గేటువైపుగా వెళ్ళిపోయాడు

రిక్షాలో ఇంటికి వెళదామనుకున్న సుబ్రహ్మణ్యం బస్‌స్టాపదగ్గర నిలబడిఉన్న సుదర్శనని చూసి అది విరమించుకుని తానూ బస్‌స్టాపదగ్గరకి వెళ్ళాడు రోడ్డు క్రాస్‌చేసి

'ఏమోయ్ సుదర్శన్ రిహార్సల్సు ఎప్పటినుంచి మొదలుపెడుతున్నారు? విజయని కలుసుకున్నట్టున్నావే?'' అన్నాడు సుబ్రహ్మణ్యం

రేపటినుంచండి'' అన్నాడు సుదర్శన్

"అయితే మూర్తినాటకమే వేయడం ఖాయమన్న మాట మూర్తికూడా చేస్తున్నాడా నాటకంలో?"

'లేదండీ నేనే ఆయన్ని వెయ్యమన్నాను మా కాలేజీనుంచి ఇక్కడికి రిహార్సల్సుకు రావాలంటే కష్టం అని మూర్తిగా రొప్పుకోలేదు'

'మరి రోజూ నువ్వు రిహార్సల్స్‌కి రాకపోతే విజయ పూరుకోదేమో నీకు అందరికంటే ఎక్కువ రిహార్సల్స్ అవసరం అంటుందికదూ"

'నిజమేనండి నాకు పోర్షన్ సరిగా రాదు రిహార్స ల్సెన్నా ఎక్కువచేస్తే గుర్తుంచుకుంటానని అంటూ రావిడ" అన్నాడు నవ్వుతూ సుదర్శన్

'పోనీ అంత నీతో ఇబ్బందిగా ఉంటుందనుకుంటే మూర్తినే వెయ్యమని మొహమాటపెట్టకపోయిందా విజయ గట్టిగా అడిగితే మూర్తి కాదనలేదుగా!" అన్నాడు సుబ్రహ్మణ్యం

సుదర్శన్ ఇంకేమీ మాట్లాడలేదు

'వస్తానోయ్ బస్ ఇప్పుడప్పుడే వచ్చేటట్టు లేదు రిక్షాలో పోతాను ఒంట్లో బాగోలేదుకూడ" అని రిక్షా మాట్లాడుకుని వెళ్ళిపోయాడు సుబ్రహ్మణ్యం

నిజంగానె జ్వరంవచ్చి సుబ్రహ్మణ్యం నాలుగు రోజులు కాలేజీకి సెలవుపెట్టాడు బహుశా రిహార్సల్సు మొదలయిఉండవు కాలేజీలో అనుకున్నాడు ఒకవేళ మూర్తి స్క్రిప్ట్ ఇచ్చినా తనమాటలు విన్నాక సుదర్శన్ రిహార్సల్స్‌కు వెళ్ళిఉండడు అనుకున్నాడు జ్వరంవచ్చి

ఇంట్లో కదలకుండా పడుకుని ఉన్నాడన్నమాటేగాని, మనస్సు పరిపరివిధాలపోయింది విజయ తనని ఉపేక్షచేస్తోందా! లేకపోతే విజయ మూర్తితో సుదర్శన్‌తో చనువుగా ఉంటోందనా తనకి ఆప్పుడోలేని బాధ. తనని ఉపేక్ష చేసినా భరించగలడుకాని విజయ సుదర్శన్‌పక్క ప్రేయసిగా చేసినా మూర్తితో అతనినాటకాన్ని ప్రశంసిస్తూ అతనిపక్కగా కూర్చున్నా తాను భరించలేడు. విజయ శ్రేయస్సు కోరేవాడే తాను. అందుకే గా ప్రిన్సిపాల్ సెలవులో ఉండటంవల్ల ఇంటర్వ్యూకమిటీలో తనూ ఒక మెంబరుగా ఉండి విజయ వెంటనే అదే కాలేజీలో లెక్చెరరవడానికి తోడ్పడ్డాడు. విజయ ఆ సంగతి గుర్తించినట్టు కనపడదు. కేవలం తన ఫస్ట్‌క్లాసే కారణం అనుకుంటోందేమో. విజయ తన స్టూడెంట్‌గా ఉన్నప్పుడుకూడ తెలివైందని ఎంతో అభిమానంతో అన్నివిధాలా ప్రోత్సహిస్తూఉండేవాడు. అందుకనైనా కృతజ్ఞతగా ఉండొచ్చుగా. 'విజయ అంటే సుబ్రహ్మణ్యంగారికి ఇంతటి ప్రత్యేకాభిమానమేమిటి" అని కొందరు కుర్ర లెక్చరర్సు స్టూడెంట్స్ నవ్వుకోవడం గుర్తుకొచ్చింది. ఎందుకో సుబ్రహ్మణ్యానికి అలా విజయని తనతో కలిపి నవ్వుకుంటే హాయిగానే అనిపించేది కోపంవచ్చేదికాదు. ఇలా ఆలోచించుకుంటూ జ్వరంతో పడుకునిఉన్న సుబ్రహ్మణ్యానికి ఆలోచనలతో బుర్ర వేడెక్కితే 'విజయ ఏంచేస్తే నాకెందుకు ఏ వెధవతో తిరిగితే నాకెందుకు" అని ఆలోచనల్ని తరిమేస్తున్నట్టుగా గట్టిగా తలపట్టుకు పడుకున్నాడు.

అయిదవరోజు జ్వరంతగ్గి కాలేజీకి వెళ్ళాడు సుబ్రహ్మణ్యం చూడగానే ప్రిన్సిపాల్ 'ఆరోగ్యం ఎలావుంది?" అని అడిగాడు ఇంకా స్టాఫ్‌నిపెంచడం విషయం మాట్లాడాడే కాని, ఫంక్షన్‌సంగతి ఎత్తలేదు సుబ్రహ్మణ్యంకూడా తనకుతానై ఆ సంగతి ఎత్తలేదు బహుశా ఫంక్షన్ ఆగిపోయి ఉంటుందన్న తృప్తితో ప్రిన్సిపాల్ రూమ్‌నుంచి బయటకు వచ్చాడు విజయ, మూర్తి వరండాచివర నిలబడి నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు విజయ ఎందుకో నవ్వింది ముభావంగాఉండే మూర్తికూడా గట్టిగానవ్వాడు సుబ్రహ్మణ్యానికి ఎవరో వీపు చెళ్ళుమనిపించినట్టయింది 'అయితే మూర్తి విజయ స్నేహంగానే ఉన్నారన్నమాట! మూర్తితో తనన్నమాటలన్నీ తప్పకుండా విజయతో చెప్పే ఉంటాడు మూర్తి ఓ గాడ్ కానీ చూస్తాను అనుకుంటూ యుద్ధానికి సన్నద్ధుడైనట్టుగా వాళ్ళవైపుకు నడిచాడు

విజయ మూర్తి ఒకేసారి 'నమస్కారమండీ" అన్నారు

'ఏమోయ్ రిహార్సల్స్ ఎలా నడుస్తున్నాయ్' అని అడిగాడు మూర్తిని సుబ్రహ్మణ్యం

'బాగానే సాగుతున్నాయంటున్నారు విజయగారు నాకాట్టే ఆ విషయాలు తెలియవు నేను వెళ్ళడంలేదండి" అన్నాడు మూర్తి

'అదేమిటి నువ్వు హీరోగా వేస్తున్నానని అన్నట్టు

న్నాడు సుదర్శన్" అన్నాడు సుబ్రహ్మణ్యం ఏదో గుర్తు తెచ్చుకుంటున్నట్టు

"లేదండి మొదటినుంచీ సుదర్శన్‌గారే వేయాలని అనుకున్నాం" అన్నాడు మూర్తి

'ఓహో! అయితే సుదర్శనే వేస్తున్నాడన్నమాట ప్రమీల వేస్తోందా నారోయిన్‌గా" అన్నాడు మళ్ళీ సుబ్రహ్మణ్యం ఏమీ తెలియనట్టు

"లేదండీ విజయగారే వేస్తున్నారు" అన్నాడు మూర్తి

విజయవైపు చూపులు తిప్పి 'ఏమమ్మా చెప్పనే లేదే" అన్నాడు సుబ్రహ్మణ్యం ఉక్రోషంతో ఏడవలేక నవ్వినట్టు నవ్వుతూ

"మీరీమధ్య కాలేజీ రావడంలేదుకదండీ సందర్భం పడలేదు ఇంతకీ మీ ఒంట్లో ఎలావుంది?" అంది విజయ

థాంక్స్ బాగానేఉంది ఫంక్షన్‌కి పిలుస్తారుగా నన్ను" అన్నాడు పెదవివిరిచి నవ్వుతూ సుబ్రహ్మణ్యం

'మీరే అధ్యక్షతవహించాలని మేమందరం కోరుకుంటున్నాం ఈవేళ మీరు కాలేజీకి రాకపోతే మీయింటికి వద్దామని అనుకున్నాం" అన్నాడు వెనకవైపునుండి వస్తూ సుదర్శన్

'నా కెక్కడ కుదురుతుందోయ్ నాకు ఒంట్లో బావుండటంలేదుకూడా కానీయండి, చాలా వుత్సాహంగా జరుపుతున్నారు వస్తానోయ్ మరి" అని ప్రోత్సహిస్తున్న

టుగా ఒక వంకరనవ్వు నవ్వి ముందుకు నడిచివెళ్ళాడు సుబ్రహ్మణ్యం

ముందుకు నడుస్తున్న సుబ్రహ్మణ్యానికి తన వీపు వెనుక వాళ్ళుముగ్గురూ తననిచూసి నవ్వుకుంటూ కబుర్లు చెప్పుకుంటూన్నట్లనిపించింది ఆ ముగ్గురూ తనని వెంట తరుముతున్నట్టుగా గబగబా క్లాస్‌రూమ్‌లోకి వెళ్ళాడు ఏదో పాఠం అలవాటుచొప్పున చెప్పుకుపోతున్నాడేకాని మనసక్కడలేదు మధ్యలోనే క్లాసువదిలేసి వచ్చేశాడు

దోవలో విజయ ఒక్కతే లాన్స్‌వైపుగావస్తూ ఎదురు పడింది విజయతో ముఖాముఖి ఏదో తేల్చేసుకుందామనుకున్నాడు ఇంతక తేల్చుకోవలసిందేమిటో తనకె తెలియడం లేదు మళ్ళీ తనకే అదోలా అనిపించింది విజయకోసమే ఆగినట్టుగా ఆగిపోయాడుకూడా విజయ దగ్గరకు రాగానే 'ఏమమ్మా చాలా శ్రమపడుతున్నట్టున్నావ్ చిక్కిపోయావ్ చాలా'' అని పరామర్శించాడు సుబ్రహ్మణ్యం

'అబ్బే! శ్రమేంలేదండి ఈసారిపనంతా మూర్తిగారు సుదర్శన్ చూసుకుంటున్నారు'' అంది విజయ

'గాడ్ విజయనోటకూడా వీళ్ళపేర్లే'' అని లోన అనుకుని కాఫీతీసుకుని వెళుదువుగాని రామ్మా కాంటీన్‌లో'' అన్నాడు కనీసం అక్కడ విజయను మాటలతో కవ్వించి ఏడ్పేటట్టు చేద్దామన్నకసితో

'సారీ వాళ్ళంతా రిహార్సల్సుకోసం ఎదురు చూస్తూ వుంటారు ఈవేళ సెట్టింగ్సువిషయం మాట్లాడటా

ఎకి మూర్తిగారికికూడా రమ్మన్నాం రిహార్సల్స్‌కి" అంది విజయ చాలా మామూలుగా

'మూర్తి సుదర్శన్ తనువాళ్ళతో అన్నమాటలు బహుశా విజయకు చెప్పలేదేమో అనుకున్నాడు ఒక్క క్షణం సుబ్రహ్మణ్యం 'ఒకవేళ చెప్పినా వాళ్ళని కన్విన్స్ చేసి తనదగ్గర ఆ విషయాలేమీ తెలియనట్లుగా ప్రవర్తించి వాళ్ళిద్దరూ తనతో చాలా సహకరిస్తున్నట్టుగా చెప్పి తన మీద దెబ్బతీస్తోందేమో అనుకున్నాడు మరుక్షణం ఇది మరీ భరించలేకపోయాడు 'కనీసం తను వాళ్ళిద్దరితో అలా చెప్పినందుకు విజయ తనతో దెబ్బలాడినా బావుండును కాని విజయ తన నిలా ఎనానంగా ఓడిస్తే భరించటం కష్టం అనుకున్నాడు 'ఫరవాలేదులేవమ్మా రిహార్సల్సుం పది నిముషాలు ఆలస్యమయితే కొంపలు మునిగిపోవు" అన్నాడు సుబ్రహ్మణ్యం

'అదేం లేదనుకోం.. మీకు తెలియందేముంది మన కాంటీన్ సంగతి మనల కూర్చోబెట్టి అప్పుడు కుంపటి వెలిగిస్తాడు ఆలస్యమవుతుందండి మళ్ళా లాస్టు పీరియడ్ నాకు క్లాసు వుందికూడ ఈలోపున ఒక్క రిహార్సలన్నా అయితే" అంది విజయ

'అయితే రిహార్సల్సు జోరుగా సాగుతున్నాయన్న మాట ఎందుకైనా మంచిది కాస్త జాగ్రత్తగా ఉండు లాస్టుమూమెంట్‌లో నిన్ను వీళ్ళు అభాసుపాలుచేయొచ్చు" అన్నాడు సుబ్రహ్మణ్యం హితబోధచేస్తున్నట్టుగా

"అలాంటి భయమేమీ లేదండి వాళ్ళసంగతి నాకు, నాసంగతి వాళ్ళకి బాగా తెలుసు" అంది విజయ

'అయితే నాకేనన్నమాట వీళ్ళసంగతి తెలియంది' అని లోలోపల అనుకుని 'ఆ నమ్మకంవుంటే ఫర్వాలేదు ఇంతాకష్టపడి చివరికి వాళ్ళు సహకరించక ఏమన్నా న్యూసెన్స్ వస్తే ప్రిన్సిపాల్ ఏమైనా అనుకోవచ్చుననే ఉద్దేశ్యంతో అన్నాను నాకళ్ళముందటిదానివి ఇంతధైర్యంగా ఒంటరిగా ముందుకు వెళ్ళగలుగుతున్నావంటే నాకు చాలా అబ్బురంగా వుంది" అన్నాడు సుబ్రహ్మణ్యం

'ఒంటరిగా ఏముందండీ మీఅందరి సహకారంతోనే నేను ఏదైనా చేయగలుగుతున్నాను అయినా ఇదంతా మీచలవేగా" అని చిన్నగానవ్వి వెళ్ళిపోయింది

ఆ నవ్వు ఎందుకో సుబ్రహ్మణ్యానికి తనని వెక్కిరించినట్టుగా అనిపించింది 'నువ్వెందరితో అతితెలివిగా ఎన్నెన్ని ఎత్తులు వేసినా వాళ్ళందరూ చివరికి నాపక్షమే" అన్నట్లుగా ధ్వనించిందే ఆ నవ్వు అనుకున్నాడు సుబ్రహ్మణ్యం

'నీ బలహీనతను క్షమించానులే" అన్నట్టుగా వున్నాయే నవ్వుతూవుంటే ఆ కళ్ళు

'ఓ గాడ్! కొంపదీసి నన్ను చూసి జాలిపడటంలేదు కదా విజయ!" అలా అని తట్టగానే కళ్ళు తిరిగినట్లయి వరండా స్తంభానానుకుని నుదురు చేత్తోపట్టుకొని నిలబడి పోయాడు సుబ్రహ్మణ్యం

# నిట్టూర్చింది

'చంద్రుడు తారాదేవిని ముద్దుపెట్టుకోవడంలో పన్నుతగిలి పైపెదవి చీరుకుపోయిందట'' అన్నమాటలు వెనువెంట నవ్వూ వినపడ్డాయి - అప్పుడే కాలేజిగేటులో అడుగుపెట్టిన సుమతికి

ఎవరో గట్టిగా కాలంపెట్టి పొడిచినట్టుగా అయి బాధతో సుమతిహృదయం కుమిలింది అనుకోకుండా చేతి లోని జేబురుమాలుతో మూతిమూసుకుంది జేబురుమా లులోనుంచికూడ పైపెదవిమీది గ్రహణం మొరకి వేతికి తగిలింది 'అంత అసహ్యంగా క్రూరంగాకూడ మాటలు అనగలిగేవాళ్ళుంటారా'' అని మథనపడింది మామూలుగా 'గ్రహణం మొరకరా'' అనో 'పెదవిమీద ఆ చిరిగేమి టిరా'' అనో అంటే అంత బాధపడివుండకపోను సుమతి ఎంతో మధురమయిన శృంగారచేష్టలను వర్ణిస్తూ ఏడిపిం చాలా అనుకొని వనన్ను ని ఎండుకుంది అక్కడనుంచి అలా మాయమయిపోతే బాపుంటుందనుకుంది వాళ్ళు తనని మాటున్నారనేసంగతి మర్చిపోలేకపోతోంది అవమానంతో సిగ్గుతో నడవలేకపోతోంది

'పనితలంపు వాంఛగమనం సోయగిమమో'' అన్న మాటలు వినపడి పక్కకు మాచింది 'కాలేజి బ్యూటి' అని పేరుపొందిన ఆశాలత వినుయగా వస్తోంది రెండంగ లలో సుమతిని కలుసుకుంది ''బుద్ధిలేకపోతేసరి'' అని

ముఖం చిట్లించింది ఆశాలతవెంట నీడలా వెయిటింగ్ రూముకు వెళ్ళింది సుమతి

క్లాసుకు వెళ్ళింది ఎవరు నవ్వుతున్నా తననిచూచే నవ్వుకుంటున్నారనుకుంది మధ్యాహ్నం తలనొప్పిగా ఉందని చెప్పి యింటికి బయలుదేరింది ఇక అక్కడ ఉండలేక, పిచ్చిగా నడుస్తోంది రోడ్డుమీద సుమతి

'కొందరు కట్టుకుంటే చీర కందమొస్తుంది కొందరు కట్టుకుంటే ఉన్న అందం పోతుంది'' అని వినిపించాయి ఎవరో కుర్రాళ్ళమాటలు

ఎవరో తనని నిలువునా చీరేస్తున్నట్టుగా వుంది సుమతికి ఇంటికివెళ్ళి మంచంమీదపడింది, తల్లితో 'తల పగులుతూంద''ని చెప్పి 'పగులుతున్నది తలకాదు హృదయం'' అని మనసులో అనుకుంది

తాను విన్నమాటలే చెవులలో గింగిర్లెత్తుతున్నాయి తన నల్లటిబొల్లి తనకే అసహ్యం వేస్తోంది మూతిదగ్గరకు పొరపాటునకూడ చేయి పోనిచ్చుకోలేదు తనంటే తనకే కోపం అసహ్యం రోత కలుగుతూంది చాల కసిపుట్టింది ఏడుస్తూ నిద్రపోయింది

నిద్రపోయిన సుమతి చాలాసేపటికి లేచింది ఊడుస్తున్న చప్పుడు వినపడుతూంది అది తెల్లవారడమో ప్రొద్దుగ్రుంకడమో తెలియలేదు సుమతికి ఆరోజే అలాంటి మాటలు వినడంకాదు తరచుగా తన ఆకారాన్ని గురించి ఇలాంటి వ్యంగ్యసంభాషణలు చెవినిపడుతూనేవుంటేవి ఇంట్లో తన పెళ్ళిసంగతి వచ్చినప్పుడల్లా తల్లి తన ఆకారాన్ని

చూచి పైకి ఏమనలేక లోనపడే బాధను సుమతి గుర్తిస్తూనే వుంటుంది

తన మేనమామకొడుకు చంద్రంతో ఒకనాడు అమ్మ 'నాయనా నీవు కాకపోతే ఇంకెవరు చేసుకుంటారు నీమీదే ఆశపెట్టుకున్నాం" అన్నప్పుడు "నేనా? సుమతిని చేసుకోవడమా" అని బయటికివెళ్ళిపోతున్న చంద్రానికి తనముఖం చూపడానికి ఎంత భయపడింది సిగ్గుపడింది, దుఃఖంతో అవమానంతో

సుమతి అప్పటినుంచి తన పెళ్ళినిగురించి ఆలోచించుకోవడమే మానేసింది ఎంతవరకూ మానేసిందంటే సినిమాలో ప్రేమకలాపాలను చూచినప్పుడుగాని నవలలో శృంగారఘట్టాలను చదివినప్పుడుగాని అలాంటిసమయాలు తన జీవితంలోనూ ఎప్పుడైనా సంభవిస్తాయనే ఊహగాని ఆశగాని అవి రావేమోననే దిగులుగాని చింతగాని ఏమీ ఉండేవి గావు

తాను నల్లగా వుండటమనేసంగతి పై పెదవి చీలి వుందనికాని ఏదీ గుర్తుండటంకూడా లేదు కాని ఎవరో ఒకరు వాటిసంగతి పనిగట్టుకు గుర్తుచేస్తూనే వుండేవారు తానెంత గుర్తించుకోకపోయినా దానివల్ల వారుపొందే మహానందమేమిటో ఎంత బుర్రబద్దలుకొట్టుకున్నా అర్థంకాదు సుమతికి హృదయం ఎడతెగని పరుశ్నలతో బండవారింది ఎవరన్నా ఏమన్నా అన్నా వినిపించుకోకుండా తనను కానట్లుగా వెళ్ళిపోయేది వేరే ఇంకేవేవో విషయాలు ఆలోచించేది

కాని ఆరోజు ఆరోజెందుకో లేచినప్పటినుండి చాల సంతోషంగావుంది సుమతికి తనకెంతో యిష్టమయిన లేతఊదారంగు జార్జెట్ చీర కట్టుకుంది ఇంటరయ్యాక బి ఏ యం ఏ కూడా చదివి లెక్చరరవాలని కలలు కంటూ ఊహాప్రపంచంలో తేలిపోతూ కాలేజీకివస్తూ వుండగా దభీమని పడేశారు తనని ఎవరో ఆ మాటలని తన మీద కప్పిపట్టినట్టుగా పడినదాన్ని తిరిగి లేవనీయకుండా మరింత బాధించారు తనింటికి తిరిగివస్తూవుండగా

బండబారినహృదయం చితికి రక్తం కోడుతూంది ఎందుకో తన నల్లనిశరీరాన్ని బాగా చూచుకుంది ప్రక్క టేబుల్ మీది అద్దంతీసుకొని చేతితో పెదవి చీలికను తడుముకుంది తన పెదవిని ఆప్యాయంగా తడుముకుంది అందరూ అసహ్యించుకునే హేళనచేసే తన పెదవిని తన ఒంటిని చూచుకుంటే ఎక్కడలేని జాలీ పుట్టుకొచ్చింది తన నల్లటిశరీరం చీలినపెదవి తన కడుపునపుట్టిన రెండు కవల పిల్లలా అనిపించాయి ఆ యిద్దర్నీ ఎవరో పట్టుకుని పీకెలు నులిమేస్తున్నట్టుగా ఖంగారుపడింది వాళ్ళను రక్షించాలి 'తాను కాకపోతే వాళ్ళనింకెవరు రక్షిస్తారు? అనుకుంది తనకు తానే చాల ఆప్యాయత కనపరుచుకుంది ఆపేక్షగా మూతిని మోకాళ్ళకాన్చుకొని వళ్ళంతా దగ్గరగా మునగదీసుకు మంచంమీదకూర్చుంది కాసేపు తాను చేయవలసిన పెద్దపనేదో చేసి అలసినట్లుగా ఎవరినో పెద్దఆపదనుండి రక్షించి సాకినట్లుగా ఉస్సురని నిట్టూర్చింది సుమతి తరువాత

# ఇదీ నా బాధ

'అయ్యా తమరికేమైనా కాస్త తీరికఉందా "
అంటూ వచ్చాడు సత్యసాగర్ కృష్ణమూర్తి గదికి

రాత్రి సుమారు ఎనిమిదిగంటలవేళ అప్పుడే భోజనం చేసి పడకకుర్చీలో వక్కపొడి నములుతూ జార్లబడి కూర్చున్నవాడల్లా లేచి ముందుకువంగి కూర్చుని ఎదుటి కుర్చీని చూపుతూ 'కూర్చోవయ్యా నాకు తీరికఉంది అంటేనే కూర్చుచేటట్టు లేకపోతే అలానే తిరుగుముఖంపట్టి ఆపళానే వెళ్ళిపోయేటట్టు ఆ పాజేమిటి నీతో కూర్చోవడానికి నాకు తీరిక దానంతట అదే కలుగుతుంది" అన్నాడు కృష్ణమూర్తి

సత్యసాగర్ ఇక ఏమీ మాట్లాడకుండా తలవంచుకు కూర్చున్నాడు ఒకనిమిషం

ఇంతలో కృష్ణమూర్తి ' 'అయ్యా తనురు అంటూ మొదలుపెట్టావు పెద్దవిషయమేదైనాఉందా? మళ్ళీ మీ అత్తగారి ఆర్థికచిక్కుల్లో నిన్నుకూడ పాలుపంచుకోమంటున్నారా?" అన్నాడు

'అబ్బెబ్బే! ఆర్థికబాధేంకాదు" అని సత్యసాగర్ మళ్ళా మౌనంవహించాడు

'మళ్ళీ మీ పక్కింటి డాక్టరుగారు మీ అమ్మగారికి పొడిదగ్గువస్తే టి వి అని ఖంగారుపెట్టి ఎక్సరే తీయించమని అనడంలేదుకదా!"

'డాక్టరుగారి బాధ కాదయ్యా ''

'మీ బాస్ లవ్ శాంక్షన్ చేయనన్నాడా?''

'బాసు బాధ కాదయ్యా ''

'మీవాడికి సీటు దొరికేటట్లు లేదా?''

'దొరికేటట్టేఉంది అసలు దొరికినా దొరకక పోయినా ఆ బాధ కాదయ్యా ఇది ''

'మరి ఏమిటంటావ్ అన్నిరకాల ఈతిబాధలూ ఏకరువు పెడుతుంటేని ప్రతిదాన్నీ కాదంటున్నావు ఎవం కైనా జబ్బుచేసిందేమో అనుకుంటే అలాటి చిహ్నాలు నీ ముఖంలో కనపడటంలేదు ఖంగారు వగైరాలు లేకుండా తెల్లబోయినట్టు ఆనక తాపీగా తేరుకోవచ్చునన్నట్టుగా ఉందేమిటి వాలకం'' అన్నాడు కృష్ణమూర్తి సాగర్ ముఖం మీద స్పాట్ లైట్ వేసి చదువుతున్నట్టుగా

'నిజంగానే తెల్లబోయానోయ్ మూర్తి ''

'ఏమిటి సంగతి? మా ఆవిడగారిని ఈసారి నువ్వు వ్రాసిన కథ చాలా బావుందందా?

'అబ్బెబ్బె అదికాదోయ్ తను నా కథలు చదవడం మానేసి చాలారోజులయింది ఇప్పు డది కాదోయ్ నా బాధ ''

'ఇదుగో సాగర్! ఇక అట్టే నా శక్తిని పరీక్షించకు సరుకు ఖాళీఅయిపోయింది నీయీ సరికొత్త యీతిబాధే మిటో సెలవీయి ''

'చెప్పకుండామరేగా ఇంటికన్నా వెళ్ళకుండా ప్రెస్

నుంచి వసుగెత్తుకుంటూవచ్చాను కాని ఎలా మొద లెట్టాలో తెలియడంలేదు శంకరం లేమూ—?”

ఆఁ ఆఁ నీతో పనిచేస్తూఉంటాడు ఏం వాడె మైనా మొదటిసారి సత్యం పలికాడా!”

‘లేదులేదు ఆపని మరోజన్మకి పెట్టుకున్నా డులే మొన్నను ఇదేటైముకి ఆ వారం వేయవలసిన కథా నికయూ అవీ చదివి మీ యింటికొచ్చి నీతో కాసేపు బాతాఖానీకొట్టి వెళిదామా లేకపోతే త్వరగా ఇంటికి పోయి మా ఆవిడ తప్పకుండా చేసిఉంచుతానన్న సేమ్యా పాయసం తిననా అని ఆలోచిస్తున్నాను ”

‘ఆ సేమ్యాపాయసంతోపాటు మీ ప్రక్కఇంటి డాక్టరుగారి వయోలిన్ సాధనతోపాటు సంగీతరసోపాసన కూడ చేయవలసివచ్చేది ”

‘అదీ నిజమే ఆ బాధనుంచి తప్పించుకోవడానికె నేగా నిర్దిష్టసమయానికి ఇంటి వెళ్ళకుండా ఆఫీసులో అక్కడా గడుపుతానంటే మాఆవిడ నమ్మదు స్నేహితు లుంటే నాకు ఇల్లు గుర్తురాదని దెప్పుతుంది ఇంతకీ మొన్న నలా కూర్చున్నపుడు శంకరం వచ్చాడు ఆ వెనకనే శివ రావుగారుకూడా వచ్చాడు ఏమండీ ఈసారి ధర్మమూర్తి వ్రాసపంపాడే ‘జలపాతం అన్న కథ చదివారా అమో ఘంగాఉంది అన్నారు ”

‘ఓ అదా! నేను చదివానోయ్ ఇవాళ మీ పత్రి కలో ఉప్పెనలా ఉందనుకో నిజంగానే అమోఘంగా ఉంది ఇంతకీ నువ్వేమన్నావ్?”

'నేను సమాధానం చెప్పేలోపునే ఆయన్ని బయట నించి ఎవరో కేకవేస్తే వెళ్ళిపోయారు శంకరం ఆయన వెళ్ళిపోయినవైపుగా మళ్ళీ తిరిగి వస్తారేమో అన్నట్టుగా సంకోచంగా చూస్తూ కాస్త నావైపుగా ఏం ధర్మమూర్తి కథ బావుందంటున్నారు శివరావుగార్కి విశ్వాసం ఎక్కువే అన్నాడు"

'మెచ్చుకోదగ్గవిషయమే మనుష్యులకు ధాన్ని ఇవ్వకుండా జంతువులే దాన్ని పూర్తిగా కుత్తుక పుచ్చుకొన్న ఈరోజుల్లో విశ్వాసం శివరావుగారికైనా ఉండటం అనేది చెప్పుకోదగ్గది"

నీ వ్యాఖ్యానం అమోఘంగా ఉందిరే ఇంతకీ శంకరం వంకరచూపులు మాటలు విని ఇదేదో గొడవకి ముడిపెట్టేటట్టున్నాడని ఏవిధమైన ఆసక్తి మాపకుండా నేను మాటలు మార్చేశాను నే నెంతగా మాటలు మారుస్తూ వచ్చానో తా నంతగా శివరావుగారివిషయంవైపుకే మొగ్గి మాటలు సాగించాడు"

'ఏమంటాడు ఇంతకీ?"

"ధర్మారావు ఆమధ్య శివరావుగార్ని హోటలుకు తీసుకువెళ్ళాడట అక్కడినుంచి ఇద్దరూ సినిమాకు వెళ్ళారట రెంటింటికీ డబ్బు ధర్మారావే పెట్టుకున్నాడట '

'తనని తీసుకువెళ్ళలేదనేమో శంకరంగాడి ఏడుపు"

'అలాఏడ్చినా బాగుండును ఇంతకీ శంకరం అలా చెప్పినా అది అంత ప్రత్యేకంగా చెప్పుకోదగ్గవిషయం

కానట్టుగా మొహంపెట్టాడు అక్కడికయినా ఆ ప్రసంగం మానుతాడేమోనని ”

‘అబ్బే మొత్తానికి ముసలాయన విశ్వాసంగా గుర్తుంచుకుని ధర్మారావుకథ బావుందన్నాడు ‘ఫరవాలేదు’ అంటూ ఒకసారి భుజాలు ఎగరవేసుకుని ఎవరూ వినలేదుకదా అన్నట్టుగా అటూఇటూ పక్కలకి చూశాడు”

‘నువ్వాకపని చేయాలిసింది ‘నిజమా’ అంటూ ఆతురత కనపరుస్తూ టేబులుమీద ముందుకువంగి కింద కాళ్ళతో వాడుకూర్చున్న కుర్చీని ఒక్కతాపు తన్నాల్సింది ”

‘నిజమే నీవన్నది ఈ వెధవ తనకుళ్ళుబుద్ధి బయటపెట్టుకోవడం తప్పితే వాడికొచ్చిన లాభమేమిటి? ఇప్పుడు ధర్మారావు ఈ కథని మొదటిసారిగా వ్రాసి పత్రికలో ఎలా గైనావడాలని తాపత్రయపడలేదుగా ఇప్పటికే రచయితగా ఒకస్థానం కలిగినవాడు పోతే శివరావుగారుకూడా ధర్మారావుకి ఖర్చుపెట్టించుకునేటంత గతిలేనివాడు కాదుగా ఆయన ఇలాంటి శంకరంగాళ్ళకి ఎంతమందికి రోజూ టీలు కాఫీలు ఊరికే పోయించటంలేదూ శంకరం దరిద్రుడు – ప్రతివిషయానికి విపరీతార్థాలు కలిపిస్తాడేమిటా అని ”

“ఛెడా బడా పెట్టాల్సింది గాలుగానాను ”

‘ఇంకావిను అప్పుడే ఏమయింది ఇంతలోనే ధర్మారావు శివరావుగారున్నారా? అంటూ లోపలికి వచ్చాడు నిజంగా అతనికథ విన్న నేను ఒక్కమాట అనలేదు

ఏదో పొడుకొట్టినవాడులా శంకరంగాడు లేచినుంచుని ధర్మా రావుచేయి గుంజేసినంత పనిచేశాడు షేక్‌హాండిస్తూ ఇక అతనికథని ఒకటే పొగడడం అంతటితో ఆగాడా 'ఇంకా అడగండి సత్యసాగర్ గారిని ఇందాకణ్నుంచి మీ కథ బ్రహ్మాండంగా ఉందని చెబుతున్నాను అన్నాడు"

'బహుశా నీ వచ్చేదు ఆముదంతాగిన ముఖం పెట్టి వుంటాన్"

'ఆ సంగతి నువ్వు ఊహించుకోవలసిందే వాడి ఉద్దేశ్యమేమిటో? నేనేమయిపోవాలని నేను నోరు తెరచి సమాధానం చెప్పేలోగా ధర్మారావుచేయిపట్టుకుని 'శివ రావుగారు ఆ గదిలో ఉన్నారు పదండి అంటూ ధర్మా రావుని లాక్కుపోయాడు"

'అలా లాక్కుపోయి నువ్వు అతనికథ చచ్చుగా ఉందని అన్నావని చెప్పినా చెప్పుఉంటాడు"

'ఆఁ ఆఁ అంత సమర్థుడే ఇలాంటివాళ్ళని ఏంచేస్తే పాపం ఉందంటావ్"

'ఏంచేసినా పాపంలేదు చూద్దాం మనతరాల్లో కాకపోయినా ముందు ముందయినా ఇలాంటివాళ్ళకి శిక్ష ఏర్పడక పోతుందంటావా?"

'మళ్ళా పేటో ధోరణికి మారుతున్నావ్ ఆలో చించు తీరికగా కాస్త నేను తేసుకున్నాను " 'మరి వెళ్ళొస్తా రేపుకలుస్తా" అంటూ సత్యసాగర్ ఇంటిముఖం పట్టాడు

# వడదెబ్బ

'ఎలాఉందో! రెండురోజుల్నుంచీ జ్వరం వస్తోందట ఎంతో మంచావిడ ఎంత ప్రేమగావుంటుందో నేనంటే ఎక్కువ పరిచయంకూడా లేదు మళ్ళీ లెక్కకు సరిగా నాలుగుసార్లైనా నేను ఆవిడను కలుసుకుంది"

మొదటిసారి వాళ్ళింటికి వెళ్ళినప్పుడు "ఆయన చెప్పారమ్మా నువ్వు వస్తావని నేనూ చాలా చూడాలనుకున్నాను రా అమ్మా రా" అని లోపలకి తీసుకువెళ్ళింది ఆవిడ గుమ్మంలోకి ఎదురువచ్చి వాళ్ళఅబ్బాయిని అమ్మాయిని పిలిచి 'అక్కతో కబుర్లు చెబుతూ వుండండి ఇప్పుడే కాఫీ పెట్టుకువస్తాను" అని వంటింట్లోకి వెళ్ళింది పావుగంటకల్లా కాఫీ టిఫిను తీసుకువచ్చి ప్రక్కనకూర్చుని టిఫినంతా పూర్తిగా తిని కాఫీ తాగేవరకు ఊరుకోలేదు ఆయనేంచేస్తున్నారో నే నేం చేస్తున్నానో అన్నీ వివరంగా అడిగింది ఆయన్నీ నన్నూ తప్పకుండా భోజనానికి రమ్మంది రాకపోతే నేను మీయింటికి రానంది ఆవిడని 'ఎప్పుడొస్తారు మాయింటికి?" అంటే 'పిల్లలతో నేను కదలటం కుదరదమ్మా మీ బాబాయి పెద్దపిల్లలు వస్తారులే రేపు భోజనాలగొడవ నేమీ పెట్టుకోకు ఒక్కదానివే చేసుకోవాలి చిన్నపిల్లవు" అంది నేను వెళుతున్నప్పుడు

కుమ్మరింవరకు వచ్చి నేను రిక్షాఎక్కి వచ్చేసేవరకు అక్కడే నిలబడిం దావిడ చంకలో పాపతో

ఎల్లలూ బాబాయిగారు మరుచటిరోజు ఆవిడ చెప్పి నట్టుగానే వచ్చారు 'మిమ్మల్ని, ఆయన్ని ఆదివారంనాడు తప్పకుండా భోజనానికిరమ్మని చెప్పమంది అమ్మ" అన్నారు ఎల్లలు

ఆయనా నేనూ వెళ్ళాం ఆదివారం, ఆవిడంత ఆప్యా యతగా కబురుపంపితే కాదనలేక వడ్డన ఆవిడే చేసింది

'చూడమ్మా! మీ బాబాయికి ఇంటికివచ్చిన అతి థులు సరిగా అన్నం తినకపోతే చాల బాధగా వుంటుంది శుభ్రంగా తిను" అని తల్లిలా దగ్గఱకూర్చుని నెయ్యా అదీ 'వద్దు వద్దంటున్నా వేసి తినేనరకు వదలలేదు భోజనాల యినవెంటనేకూడా ఇంటికి వెళ్ళనీయలేదు 'టీ టయిము కూడ అవుతోంది టి కూడా తీసుకు వెళుదురుగాని మళ్ళీ యింటికివెళ్ళి ఏం పెడతాక్" అని చెప్పి ఇంకో రెండుగం టలు కదలనీయలేదు మాటలమధ్యలో 'నీ వింకా చిన్న పిల్లవు అనుభవం ాక్యం తక్కువ అని ఆపేక్షగా తల్లిలా అంది టీ తీసుకొనివచ్చేసేటప్పుడు వీలున్నప్పుడల్లా వస్తూ వుండండి పదిమందీ వచ్చి వెళుతుంటేనేకాని మా బాబాయికి తోచదు అం దావిడ మీ రెప్పుడొస్తారో చెప్పండి అని నే నడిగితే 'తీరికచేసుకుని ఎప్పుడో ఒకసారి నీకు చెప్పకుం డానే వచ్చి మీఇల్లు చూస్తానే అందావిడ

అన్నట్టుగానే మరో నాలుగురోజులకే యిక్కడికి వచ్చిందావిడ ఎల్లల్ని తీసుకుని వంటచేస్తుంటే, ఆవిడకూడ

వంటింట్లోనే కూర్చుని ఆవిడ పెళ్ళిసంగతీ అత్తవారిసంగతీ అన్నీ చెప్పింది

తరువాత మళ్ళీ ఒకరోజు నేనూ ఆయనా వెళ్ళాం ఆవిడదగ్గరకు అది మూడోసారి వెళ్ళడం ముఖం వాడినట్టుగా వుందికాబోలు నాది

ఆవిడ 'ఏవమ్మా! ఒంట్లో బాగాలేదా? మనసులో బాగాలేదా? ఎలా వాడిపోయిందో చూసుకో ముఖం'' అని ప్రక్కగదిలో కూర్చున్న ఆయనతో 'ఏవండీ! మా అమ్మాయిని ఏవన్నా అన్నారేమిటి ఈవేళ బిక్కముఖంపెట్టుకుని వుంది అందావిడ

'నేనేదైనా అనవలసిన అవసరం కల్పించదండీ మీ అమ్మాయి అన్నారాయన నవ్వుతూ ప్రక్కగదిలోనుండి

ఆయన నవ్వులో బాబాయిగారి నవ్వుకూడా కలిసింది "ఎంతైనా మాఎల్ల మాపిల్లే గదుటోయ్ మరి'' అన్నారు

అంతసేపూ వాళ్ళ చిన్నపిల్ల నాదగ్గరే వుంది

'ఉండవే అక్కని కాఫీ తాగనీయ్ వచ్చిందంటే చాలు ఒడివదిలిపెట్టవ్' అని మందలించింది కూతుర్ని ప్రేమగా పెద్దమ్మాయికి తాను ఆ మధ్యే కొన్న సిల్కు చీరెలు రెండూ చూపించింది ఎలాగున్నాయమ్మా! మీ బాబాయిని చెప్మంటే 'నాకు తెలియదు చీరలసంగతి నీవే కొనుక్కో' అంటారు ఆయన ఊరికే అలా అంటారుకాని నిజానికి ఆయనకు అందాలు బాగా తెలుసునమ్మా! నేను కట్టుకున్న చీర చూడు క్రిందటేడు ఆయన బెంగుళూరు వెళ్ళి

నప్పుడు తీసుకొచ్చారు రోజూ పులికి కట్టుకుంటున్నా రంగు కొస్తైనా దిగలేదు అందావిడ

అసలు ఆవిడ స్వభావమే అంతనుకుంట మహా ఆపేక్షగల మనిషి అందరంటేనూ ఎంత ఆప్యాయతగా మాట్లాడుతుందో! మందలించినా ప్రేమతో మందలిస్తుంది

నాలుగోసారి తప్పకుండా భోజనానికి రమ్మని బాబాయి గారితో ఫోనుచేయించిం దావిడ ఆరోజున మరీ కన్న తల్లిలా ఎంతఆప్యాయతగా భోజనం పెట్టిందనీ! గిన్నెలోని పెరుగంతా గుమ్మరించింది ఈ కాలపు ఎల్లలకి నాజూకు లెక్కువ చెంచాలతో లెక్కపెట్టుకుంటూ పెరుగు వేసు కుంటారు అంటూ అన్నంతిన్నాక మళ్ళీఅరటిపండు తింటేనే కాని 'పాను ఇవ్వనని అది తినేవరకూ ఊరుకోలేదు

నేనూ అనుకోకుండానే 'అమ్మ అని మాట్లాడడం మొదలుపెట్టేశాను ఎందుకో ఆవిడఆప్యాయత, ఆపేక్ష చూస్తే సహజంగానే అలా పిలవాలనిపించింది ఈ వయస్సు లోనే ఇలాచిక్కిపోతే ఇక ముందుముందు ఎల్లలుపుడితే ఏలాగమ్మా! ఇంట్లో రెండోపెద్దవాళ్ళులేక ఏదో ఇంతపెట్టుకు తింటావు కాబోలు అలాగున్నావు అందావిడ సాను భూతిగా

ఆయన 'నాకు బయట కేరేవనిఉంది వెళతామండీ" అంటే 'మీరు వెళ్ళండి ఎక్కడికో వెలుతున్నారుగా ఎస మీద మీరు పనిచూచుకొని యింటికి వెళ్ళేటప్పటికి, అమ్మాయికూడ వచ్చేస్తుంది లెండి అందాక ఇక్కడే ఉంటుంది ఇప్పుడే వెళ్ళి ఏంచేస్తుంది ఒంట గాగారోచ్చలేం

వినుకుకూడాను అని అక్కడే అట్టిపెట్టుకుంది నన్ను ఇంకా కాసేపు

బాబాయిగారి కబుర్లు చెప్పింది 'ఆయనకేం లౌక్యం తెలియదమ్మా' తెల్లనివన్నీ పాలు నల్లనివన్నీ నీళ్ళు అనుకుంటారు మరీ అమాయకం" అందావిడ వాళ్ళ చచ్చిపోయిన అత్తగారిని గురించి చెబుతూ 'ఆవిడకూడ సరిగ్గా మీ బాబాయిలాంటిదే మామగారు పోయాక అన్నను నమ్మి ఆస్తంతా ఆయనచేతిలో పెట్టింది మీ బాబాయివాళ్ళు పెరిగిపెద్దయ్యాక ఆస్తిలో మూడవవంతు చేతి కిచ్చాడాయన అని వాళ్ళ పుట్టుపూర్వోత్తరాలు ఆస్తి పాస్తుల సంగతికూడ చెప్పింది తరువాత వాళ్ళపెద్దమ్మాయి పెళ్ళిసంగతి చెబుతూ 'మీ బాబాయికి ముందు కుటుంబ సాంప్రదాయం కావాలమ్మా ఆయనకు మంచిమాటడం తోనే అసలు మనసుకుపట్టాలి లేకపోతే వాళ్ళెంత డబ్బున్న వాళ్ళయినా పలుకుబడిగలవాళ్ళయినా అసలటు వైక్కె చూడరు" అంది

మధ్యాహ్నం బాబాయిగారు ఆయనకు కనపడి 'యింట్లో ఆవిడకి వంట్లో బాగాలేదు రెండురోజుల్నుంచ జ్వరం వస్తోంది అన్నారుట

ఆయన మధ్యాహ్నంయింటికి కాఫీకి వచ్చినప్పుడు చెప్పి 'వెళ్ళిచూచిరా పాపం! ఎంతో ఆప్యాయతగా ఉంటా రావిడ నీవంటే అన్నారు

'మీరూ రండి త్వరగా ఇద్దరమూ కలిసేవెళదాం" అన్నాను నేను

ఆయన "సరే తయారుగా ఉండు నేను వచ్చేటప్పటికి" అని చెప్పి వెళ్ళిపోయారు

పాపం ఎలాఉందో ఆవిడకి ఇంకా రాలేదేం ఆయన ఆఫీసు మూసే టయిమయిందే ఇంకా రాలేదెందుకో? అనుకుంటూ వీధిగుమ్మంలో నిలబడింది నిర్మల

ఇంతలో ఆఫీసు ప్యూన్ ఏదోచీటీ తీసుకొచ్చి యిచ్చాడు విప్పిచూస్తే 'తనకింకా ఒకటి రెండు గంటలు పనిఉందట ఆఫీసులో అందుచేత తననే వెళ్ళి చూచిరమ్మని" వ్రాశాడు నిర్మల భర్త

ఇక ఆలస్యంచేయకుండా ఆ దారమ్మటే వెళుతున్న రిక్షాఎక్కి ఆవిడిల్లు చేరుకుంది నిర్మల పిల్లలందరూ ఆడుకోవటానికి పార్కుకు వెళ్ళారేమో! చడీచప్పుడూలేదు డ్రాయింగురూములో బాబాయిగారుకూడ కూర్చునిలేరు లోన గదిలోనుండి బాబాయిగారిగొంతు వినపడుతోంది

'పాపం! నిర్మల మంచిపిల్ల పేరుకుతగ్గట్టే నిర్మలమైన మనస్సు మహా ఆపేక్షగా ఉంటుంది మనమంటే" అని

'అందరూ అలాగేఉంటారు ముందుముందు త్వరగా ఎవర్నీ నమ్మేయకూడదు తరువాత తరువాత అసలు రంగులు బయటపడతాయి" అని వినిపించాయి ఆవిడ మాటలు అంతే! నిర్మల ఒక్కసారిగా కొయ్యబారిపోయింది, వడదెబ్బకొట్టినట్టయి

# డబుల్ ట్రైపాయిడ్

మధు శశియింటితలుపు కొడుతున్నాడు అయిదు నిముషాలనుంచి ఎంతకూ విడివడదాతలుపు పైనచూస్తే తాళం వేసిలేదు లోనే గడియపెట్టిఉంది తిరిగి వెళ్ళిపో తన్న మధువీపువెనుకవైపునుండి తలుపుతీస్తున్న చప్పుడు అయింది ఎదురుగా రజని నుంచుంది

తలుపుతీస 'రండి'' అంది నీరసంగా

మధు రజనిని అంతదగ్గరగా చూడలేదు ఈమధ్య లో మనిషి చాల తీసిపోయినట్టుగా కనపడింది మధు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి మధు లోనికివచ్చి కూర్చునే లోపలే రజని మరోకుర్చీలో కూలబడింది ఆశ్చర్యపడ్డాడు మధు తను రాగానే కూర్చున్నదల్లా లేచివెళ్ళి శశినివంపే రజనేనా ఇవాళ తనకెదురుగా కూర్చుండిపోయింది అను కున్నాడు తనూ ఆమెకెదురుగా కూర్చున్నాడు

'ఒక అరగంటఅయింది అక్క ఆఫీసుకెళ్ళి ఏదో పనుందిట ఒకగంటలో వచ్చేస్తానంది '' అంది రజని కళ్ళను నీరసంగావాల్చి రజనిముఖం చాల పాలిపోయినట్లు కనిపిం చింది మధుకి ఇక ఊరుకోలేకపోయాడు

'మీకు వంట్లో బాగాలేనట్టుంది?'' అన్నాడు

పెదవులను దగ్గరిగా చేర్చుకుని నవ్వింది రజని 'అవునండి ఈవేళే పథ్యంతీసకున్నాను'' అంది

'మామూలు జ్వరమేనా?" అన్నాడు ఆతురతగా మధు

'టైఫాయిడ్"

'అయితే నేను ఊరుకువెళ్ళాక వచ్చిందన్నమాట "

'అవును మీ అమ్మగారికి వంట్లో బాగాలేదట ఎలాఉన్నారు?" అంది రజని

మధుముఖంలో ఆదుర్దా కనపడింది 'కొంచెం తగ్గినట్టుగావుంటే నిన్నే నేవచ్చాను కాని ఇందాకే టెలిగ్రాం వచ్చింది చాలా సీరియస్‌గాఉందట!"

'అయ్యో! వెళుతున్నారా మరి?"

"వెళ్ళకుండా ఎట్లా? ట్రెయినుకింకా గంటటయిముంది ఏమీతోచక పిచ్చెత్తినట్టుగాఉంది ఇక్కడికి వచ్చాను "

"అక్క వచ్చేసే టయిమయింది " అంది రజని మధుని ఎలా ఓదార్చాలో తెలియక మధుకి శశియింటికి వచ్చినసంగతి అప్పుడే గుర్తుకువచ్చింది

'టీ చేస్తా నుండండి" అని లేవబోయింది రజని

'వద్దు లేవకండి అసలే నీరసంగా ఉన్నారు ' అన్నాడు మధు వారించడానికి లేస్తూ

ఒక్కసారిగా లేవబోయిన రజనికి కళ్ళుతిరిగినట్టయి తలను వెనక్కు వాల్చి కళ్ళు మూసుకుంది

మధు అనుకోకుండా రజనినుదుటిమీద చేయి వేసి "ఎలాఉంది రజనీ?" అన్నాడు

తననంత చనువుగా, ఆప్యాయతగా పిలుస్తున్న మధునుచూచి తెల్లబోయింది రజని "ఏమీలేదు మీరు కూర్చోండి కళ్ళుతిరిగాయంతే" అంది తలను కిందకుదించి తా నేదో మహాపరాధంచేసినట్టుగా మధు ముఖంలోకి చూడలేకపోతోంది ఇద్దరూ అంత సామీప్యంగా కూర్చుని మాట్లాడుకోవడం అదే మొదటిసారి

శశి ఆఫీసులో పనిచేస్తున్నాడు మధుకూడా అప్పు డప్పుడు శశిదగ్గరకు వస్తూఉండేవాడు మధు స్నేహరీత్యా మధు వచ్చినప్పుడల్లా రజనిని కాలేజీనుంచి ఇంటికి వస్తూ ఉంటునో కాఫీ తనకూ శశికీ తెచ్చిపెడుతున్నప్పుడో చూస్తూఉండేవాడు మొదటిసారి తాను వచ్చినప్పుడు రజని కాలేజీనుంచి అప్పుడే వస్తోంది

'రజనీ ఇటురా —నా చెల్లెలండీ —వీరు మధు"అని ఒకరి కొకరికి పరిచయంచేసింది శశి

మధునమస్కారానికి ప్రతి నమస్కారంచేసి చేతిలో పుస్తకంతో లోనికి వెళ్ళిపోయింది రజని

'రజని ప్రీవియస్ యస్ ఏ లో ఉంది" అంది శశి మధుతో మాటలమధ్య

అలా రజనితో పరిచయమయింది మధుకి

తరువాత మరొకసారి రజని కాలేజీకి వెళ్ళబోతూ అప్పుడేవచ్చి గుమ్మంలో నిలబడిఉన్న మధుకి ఒకమాదిరిగా నవ్వుతూ నమస్కారంచేసి వెళ్ళిపోయింది తెలిసినవాళ్ళని చూచినప్పుడు పరిచయముండేన్నట్టు ఒకమాదిరిగ నవ్వుముఖం

పెట్టడం రజనికి అలవాటు మధు కా నవ్వులో ఆప్యాయత కనబడింది

ఇంకొకసారి రజని పుట్టినరోజునాడు రజని ఎంత వద్దన్నా వినకుండా శశి మధుని టీకి పిలిచింది "

'రజనికి ఎం ఏ చదువుతున్నా తగని సిగ్గండి" అంది, శశి నవ్వుతూ మధుతో

ముగ్గురూకలిసి కూర్చునే టీ, టిఫినూ తీసుకున్నారు మధు 'షా' పుస్తకం తెచ్చిచ్చాడు

'రజనికిపుస్తకాలపిచ్చనికూడా తెలుసునా మీకు?" అంది శశి మామూలు ధోరణిలో

మధుకి చాలా సంతోషమయింది— ముందుగా తన కా సంగతి తెలియకపోయినా రజని అభిరుచికి తగినట్టుగానే తాను బహుమతి తెచ్చినందుకు అక్క తననిగురించి చెబుతున్నప్పుడల్లా రజని తెగ సిగ్గుపడుతోంది

'బాగా పరిచయమయితేనేకాని మా రజని కలివిడిగా ఉండదండీ" అంది శశి

టీ కప్పును పెదవులదగ్గఱకు తీసుకుంది రజని టీని చాల అందంగాకూడ తాగుతారనే సంగతి అప్పుడే గమనిక లోకివచ్చింది మధుకి ఎందుకో రజని మెడ పైకెత్తింది 'కంఠం మీద రేఖలు ఎంతఅందంగా ఉన్నాయి అనుకున్నాడు మధు ఏదో అందని ఆకర్షణ కనపడింది మధుకి రజనిలో శశీ మధు చాలావిషయాలు తమ ఆఫీసునుగురించి సినిమాలనుగురించి పుస్తకాలనుగురించి మాట్లాడుకున్నారు తరు

వాళ మధు వెళుతూ 'రేపు పిక్చరుకు వెళదామా వీలుగా ఉంటే?' అన్నాడు

"తప్పకుండాను చాలారోజులయింది మేముచూచి" అంది శశి

మరుచటిరోజు సాయంత్రం ఆరుగంటలకల్లా మధు వచ్చాడు శశి యింటికి

'కామెల్లీకి వెళదామా! గ్రేటాగార్బో ఉంది" అన్నాడు మధు సూచనగా

'ఓ! నాకు రజనికికూడ చాలయిష్టం ఆవిడంటే చాలారోజులయింది చూచి" అంది శశి

రజనిని పిలుస్తూ లోపలకువెళ్ళింది శశి రజనివాల కంచూస్తే ఏమీా ఎక్కరుకి బయలుదేరే పద్ధతిలోలేదు ఏదో నవల తిరగేస్తోంది దర్జాగా పడుకుని

"రజనీ, త్వరగా కానియ్ ఆయన వచ్చారు" అంది శశి

"రేపేదో ఎస్సే వ్రాసిఇవ్వాలట కాలేజీలో మీారు వెళ్ళిరండి నేను తీరుబడిగా వ్రాసుకుంటాను" అంది రజని చాలా తాపీగా

'ఇక లాభంలేదనుకొని మధు, శశిమాత్రమే వెళ్ళారు కావాలనే అలా రజని వంకపెట్టిందనుకున్నాడు మధు తనని ఏదోవిధంగా తప్పించుకోవడానికే ప్రయత్నిస్తుం దెప్పుడూ రజని తనకు దూరదూరంగా ఉండటానికి ప్రయ త్నిస్తున్నకొద్దీ తన హృదయానికి దగ్గరవుతోంది ఈమధ్య

కాస్త తఱచుగాకూడ వస్తున్నాడు కనీసం రజని ఒక్కసారైనా కనపడుతుందేమోనన్న ఆశతో ''

నిజానికి రజని వాళ్ళిద్దరికీ దూరంగాఉండటానికి కావాలనే ప్రయత్నిస్తోంది 'ఎందుకో మధు, శశికి ఒకళ్ళంటే ఒకళ్ళకి ఎక్కువ అభిమానం అనుకుంది వాళ్ళిద్దరిమధ్యా తను అడ్డంగాఉండటం యిష్టంలేక, సాధ్యమయినంతవఱకు ఇద్దర్నీ ఒంటరిగా వదులుతూ ఉంటుంది రజని

రజనికి మధు అంటే 'మంచాయనే అనే ఉద్దేశ్యం తప్ప మరేభావమూలేదు అందుకే మధు అకస్మాత్తుగా తన నుదుటిమీాద చేయివేసి 'ఎలాఉంది రజనీ?'' అని చనువుగా ఎలిస్తే తెల్లబోయింది

'మీారు నా హృదయాని కెప్పుడూ దగ్గరలోనే ఉన్నారు అదెప్పటికైనా మీారు గుర్తిస్తారనే ఆశతో ఉన్నాను'' అన్నాడు మధు టేబుల్‌మీాద పెట్టిఉన్న శశి రజనీల ఫొటోవంక చూస్తూ

మూసుకున్న రజనికళ్ళవెంట నీళ్ళుకారుతున్నాయి

మధు చాల ఖంగారుపడ్డాడు 'మీా కంత కష్టంకలిగించానా?'' అన్నాడు

"లేదు'' అన్నట్టుగా తలతిప్పింది రజని

'శశిగారితో నేను చెపుతాను'' అన్నాడు మధు ఆనందంతో

'అయితే అక్కకోసం కాదన్నమాట'' అని యింకా

ఏదో అంటూఉండగానే 'కాదు, మా యిద్దరిమధ్యాఉన్నది కేవలం స్నేహంమాత్రమే ' అన్నాడు మధు

అప్పటికి శశి రాలేదు ఆఫీసునుంచి

మధు టైం చూచుకున్నాడు టెలిగ్రాంసంగతి గుర్తు వచ్చింది నల్లబారింది మధుముఖం బాధతో

"మీకు టైమవుతుందేమో" అంది రజని

'అవును ఇంకెక్కువ టైములేదు" అని మధు లేచాడు కుర్చీలోనుంచి

'రజనికూడ లేవబోయింది మధు అమాంతం రజనిని చేతులలోకి తీసుకుని లోనకు తీసుకుపోయి మంచంమీద పడుకోబెట్టాడు 'ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకుంటావు కదూ నేనూ సాధ్యమయినంత త్వరలో వస్తాను అన్నాడు జుట్టు సరిచేస్తూ

రజనికి ఏమిచేయడానికి తోచక ఉక్కిరిబిక్కిరయి 'వెళ్ళగానే అక్కడి సంగతులు తెలియజేయండి" అంది

"తప్పకుండాను వీలయితే ట్రంకాల్' చేస్తాను నీవుమాత్రం కళ్లుమూసుకు పడుకో" అని కళ్ళమీద ముద్దు పెట్టుకు వెళ్ళిపోయాడు వెనక్కి తిరిగిచూడకుండా మధు

రజని శరీరం మనస్సుకూడ ఏదో మబ్బుల్లోకి తేలి పోతున్నట్లుగా ఉన్నాయి తరువాత రెండురోజులూ టెలిగ్రాంకోసం ట్రంక్ కాల్ కోసం ఆతురతగా ఎదురు చూచింది రజని మూడోరోజు శశి ఆఫీసునుంచి దిగులుగా యింటికి వచ్చింది

'రజనీ! పాపం మధు మొన్నరాత్రి ట్రయినుదిగి చూచుకోకుండా అరటిపండు తొక్కమీద బూటుకాలు వేశాడట! ప్రక్కనే మరో ట్రెయినువచ్చిందట కాలుజారి దానిక్రిందపడ్డాడట తరువాత ఒక గంటకే ప్రాణంపోయిందట, ఇప్పుడే తెలిసింది ఆఫీసులో ఈ సంగతి'' అంది

రజనికి నిజంగానే ఏమీ తెలియలేదు మబ్బుల్లో తేలిపోయినట్లుఉంది స్పృహతప్పపోయింది

తరువాత ఏమయిందో! శశి డాక్టరుతో 'డబుల్ టైఫాయిడా? అనటంమాత్రం దూరదూరంగా వినిపించింది రజనికి

# భ్రాంతి

సుబ్బారావు ట్రెయినెక్కుతూ అనుకున్నాడు "నేను వ్రాసినవుత్తరం నిన్న అందిఉంటుంది సుజాతకు" అని సెకండ్ క్లాస్ కంపార్టుమెంటు ఖాళీగానేఉంది పై బెర్తుమీద షుమారు నలభయ్యేళ్ళాయన నైట్‌సూట్‌లో పడుకుని ఉన్నాడు ప్రక్కబెర్తు మీద ఇద్దరు ముడుచుకుని పడుకుని ఉన్నారు ఒక చిన్నకుర్రాడు ఒకముసలావిడ సుబ్బారావు వాళ్ళ కెదురుగావున్న బెర్తుమీద బెడ్డింగు పెట్టించుకుంటూ ఉంటే, ముసలావిడ ఒకసారి తలెత్తిచూచి మళ్ళీ కళ్ళుమూసుకుంది ఇక అటువైపు ప్రక్కగా ఎవరున్నారో సుబ్బారావు సరిగా పట్టించుకుని చూడలేదు

సుబ్బారావు సీటంతా ఖాళీగాఉందికదా అని బెడ్డింగ్ విప్పి పరిచాడు మూసినకిటికీ తెరిచాడు నల్లగా చికటి అక్కడక్కడ నక్షత్రాలు మెరుస్తూ కనపడ్డాయి గాలి చల్లగా విసురుగా కొట్టింది ముసలావిడ మెలకువలో పిల్లవాడు నిద్రలో గునుస్తూ చలికి ముసగదీసుకున్నారు మరింత సుబ్బారావు కిటికీమూసేసి తానూ పడుకున్నాడు 'రాత్రంతా ఈ ట్రెయినే శరణ్యం మంచికంపార్టుమెంటు లోనే ఎక్కాను అనుకున్నాడు ముసలావిడకి నిద్రపట్టి నట్టుంది అప్పుడే గురక వినపడుతోంది చిన్నగా తెరచుకున్న బోసినోట్లోనుంచి ఆదహా నిద్రపోతూఉండగా ఏ

ఒక్కొక్కళ్ళే మేలుకుని ఆ నిద్రపోతున్నవాళ్ళందర్నీ చూస్తూ ఉంటే తమాషాగా అనిపిస్తుంది నాలుగేళ్ళక్రితం ఒకసారి చాలాసామానుతో థర్డుక్లాస్ కంపార్టుమెంటులో ప్రయాణం చేసినప్పటిసంగతి గుర్తుకొచ్చింది సుబ్బారావుకి విశాఖ పట్నంవైపువారు మొత్తం ఒక పదిమందిదాకా యిరవ య్యేళ్ళదగ్గరనుంచి నలభయ్యేళ్ళవరకు వయస్సుకలవాళ్ళవి ఒకరితలలు మరొకరితలల కానుక్కునిఉండి కొంచెంగా చొంగకార్చుకుంటూ — మొత్తానికందరివీ నిగనిగలాడుతూ జుత్తులులేని తలలు కంటబడ్డాయి సుబ్బారావుకి బెయి నెక్కగానే తిరుపతినుంచి వస్తున్నారుకాబోలు అనుకున్నాడు సుబ్బారావు వాళ్ళతలలు చూచి పరీక్షగాచూస్తే దాన్లో నాలుగయిదుతలలు ఆడవారివి ఆ రాత్రంతా తనసామాను జాగ్రత్తగా ఒకకంట చూసుకుంటూ మరోకంట వారి శయ్యారీతులను చూస్తూ నవ్వుకుంటూ గడిపాడు సుబ్బా రావు ఆసంఘటన ఇప్పుడు గుర్తుకొచ్చి నవ్వుకున్నాడు మళ్ళీ

ప్రాణస్నేహితుడు రామమూర్తి తనకు వ్రాసిన వుత్తరం తలలో మెదిలింది సుజాతగారు చాల చిక్కి పోయారు ఏదోదిగులుగా ఉన్నట్టుంటారు చూడటానికి ఇంకా పెళ్ళిచేసుకోలేదు" అని వ్రాశాడు సుజాత చిక్కి పోవడానికి సుఖంగా లేకపోవడానికి తనే కారణమనిపించింది సుబ్బారావుకు తనమీదతనకే కోపంవచ్చింది తనకాలేజీ రోజులు ఒకదానితరువాత ఒకటి మనస్సులో మెదిలాయి

సుజాత సుబ్బారావుకంటె రెండుసంవత్సరాలు జూని

యర్ సుజాత పెద్ద అందగత్తె కాకపోయినా ఏదో ఆకర్షణ ఉంది ఆమెలో సాన్నిహిత్యం పెరిగినకొద్దీ మరింత బావున్నట్టనిపిస్తుంది సుబ్బారావుకు కారు ఉండేది డ్రయివరు రానప్పుడు అతనే నాన్నగార్ని కోర్టులోదింపి, కాలేజీకి వెళ్ళేవాడు ఒకరోజువ డ్రైవరు రాలేదు శనివారం హైకోర్టుకు సెలవు అతనే డ్రైవుచేసుకుని కాలేజీకి వెళ్ళాడు కారులో క్లాసులయ్యాయి తీరా ఇంటికవెళ్ళేటయిముకి వర్షం లంకించుకుంది కారులో రామమూర్తి క్లాస్‌మేట్ శాస్త్రికూడ ఎక్కాడు ఇంటికివెళ్తూఉండగా బస్‌స్టాప్‌దగ్గర సుజాత నిలబడిఉంది చుట్టుప్రక్కల ఒక్కరూకూడ లేరు బస్ అప్పట్లో వచ్చేసూచనలూ కనపడలేదు సుజాతయిల్లు అతని బాబాయిగారి యింటిప్రక్కనే అప్పుడప్పుడూ అతనికి బాబాయిగారింట్లో కనపడుతూ ఉండేది సుజాత

సుబ్బారావు కారుఆపుజేసి 'రండి మీయింటిదగ్గర డ్రాప్‌చేస్తాను" అన్నాడు

సుజాత వద్దని వర్షంలో గొడవచేయడం బావుండదని సుబ్బారావు పక్కసీటుఖాళీగాఉంటే కారులోఎక్కి అక్కడ కూర్చుంది

రామమూర్తి ఆసంఘటనను మామూలుగానే తీసుకున్నాడు శాస్త్రిమాత్రం ఒకసారి కదిలి రామమూర్తిముఖం లోకి ఒకమాదిరిగా అర్థయుక్తంగా చూశాడు కాని రామమూర్తిముఖంలో ఏవిధమైన జవాబు దొరక్కపోవడంతో శాస్త్రిముఖంలో తొంగిచూచిన వెక్కిరింపు కాస్తా మాడి ఊరుకుంది సుబ్బారావు సుజాతను ఎవరికీ పరిచయం చేయ

లేదు అసలు అతనికే ఎవరూ సుజాతనంతవరకు పరిచయమే చేయలేదు అందులో సుబ్బారావు కొంచెం ముభావంగా ఉండేమనిషి వయసుకుమించిన పెద్దమనిషితరహా కనపడు తుంది సుజాత యిల్లు దగ్గరకువచ్చింది థ్యాంక్సచెప్ప సుజాత దిగిపోయింది ఆప్రక్కవీధిలోనే శాస్త్రినికూడ దింపేసి సుబ్బారావు రామమూర్తి వాళ్ళయింటికి వెళ్ళి పోయారు

రామమూర్తికూడ సుబ్బారావుయింట్లోనే ఒక గదిలో ఉండి నాలుగేళ్లుగా చదువుకుంటున్నాడు కాలేజిలో సుబ్బారావుకి, రామమూర్తికి మధ్య రహస్యాలంటూలేవు ఒకరంటే ఒకరికి ఎంతో ఆర్ద్రిత సానుభూతి కాలేజిలో కూడ వాళ్ళిద్దరూ అంటే మిగతా విద్యార్థులకి ఒకవిధమైన గౌరవము ఉంది

మరుచటిరోజు రాత్రి భోజనాలయాక రామమూర్తి సుబ్బారావుతో 'శాస్త్రిదరిదున్డిడ్ని ఇంకెప్పుడూ కారులో ఎక్కించుకోకు" అన్నాడు

సిగరెట్ ముట్టించుకుంటున్న సుబ్బారావు కాస్త ఆశ్చర్యపడ్డాడు ఎందుకంటే రామమూర్తి ఎవర్నిగురించి అలా త్వరగా పరుషంగా మాట్లాడడు సిగరెట్టుఒక్క పీల్చు పీల్చి, పొగవదులుతూ 'ఏం?" అన్నాడు సుబ్బారావు

'వాడేదో క్లాసులో చెవులుకొరుకుతున్నాడు నిన్న నువ్వు సుజాతను వాళ్ళింటిదగ్గర డ్రాప్ చేశావని" అన్నాడు రామమూర్తి

'ఏం, తననీడ్రాప్ చేశానుగా"అన్నాడుసుబ్బారావు

"తను మగవాడు సుజాత ఆడది అందుకని" అన్నాడు రామమూర్తి

"ఏడిశాడులే" అన్నాడు సుబ్బారావు సిగరెట్ మరో పీల్చుపీలుస్తూ ఏదో ఆలోచిస్తూ

తరువాత రెండురోజులకు క్లాసునుంచి తిరిగివస్తూ సుబ్బారావు రామమూర్తులకు ఎదురుపడింది సుజాత విష్ చేసి వెళ్ళిపోయింది వరండాలోనుంచునిచూస్తూఉన్న శాస్త్రి మరోనలుగురు విద్యార్థులు నవ్వుకుంటూ ఒకళ్ళముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు వాళ్లను చూసిన రామమూర్తి ముఖం చిట్లించుకున్నాడు ఏదోపనిమీద సుబ్బారావు ఆఫీసురూమ్‌వైపుగా వెళ్ళాడు రామమూర్తి వరండాదాటి క్లాస్‌రూమ్‌లోకి వెళుతుండగా శాస్త్రి విష్‌చేశాడు రామమూర్తి తప్పనిసరిగా విష్‌చేసివెళ్ళి కిటికీదగ్గరగా తనఎప్పటి సీట్లో కూర్చున్నాడు

'అయితే త్వరలో సుబ్బారావింట్లో విందుభోజనా లన్నమాట!" అన్నమాటలు వినపడ్డాయి

మళ్ళీ యింతలో "అంతవరకు వెళ్ళినప్పటిమాట కదా కులాల పట్టింపులు పెద్దవాళ్ళకెక్కువ చూడాలిగేమ్" అని మరొకడంటున్నాడు

"అంతే, అంతే" అంటూ శాస్త్రి గొంతు వినపడింది

కిటికీదగ్గరగా కూర్చున్న రామమూర్తి ఈమాటలన్నీ వింటున్నాడా లేదా అన్నట్టుగా శాస్త్రి ప్రక్కవాటుగా రామమూర్తివంక చూచాడు మొత్తానికి కొద్దిరోజులలోనే సుజాత సుబ్బారావుల్ని గురించి కథలు గుసగుసలరూపంలో

వ్యంగ్యసంభాషణలరూపంలో వ్యాపించిందాయి కాలేజీ అంతటికీ కాకపోతే గోడలమీద, బోర్డులమీద ఇద్దరిపేర్లు ఎక్కలేదు సుబ్బారావంటే కాలేజీవిద్యార్థులలో ఉన్న గౌరవంతో కూడిన ఒకపాటి భయం సుజాత అంటే ఉన్న ఒకపాటి మంచిఅభిప్రాయం దీనికి కారణం మరోముఖ్య కారణం రామమూర్తి అలాంటి పిచ్చిపనులు ఎవరన్నా చేశారంటే వాళ్ళముక్కలు విరగగొట్టేటంతటి చొరవగలవాడనే అభిప్రాయం విద్యార్థులలో ఉండడం

తమనిగురించి మిర్చిమసాలాతోసహా వ్యాపించెందుతున్నవిషయాలు సుబ్బారావు - సుజాత చెవులలో పడకపోలేదు ఇవన్నీ వింటూఉంటే సుజాత - సుబ్బారావుల మనస్సులలో ఒకరంటే ఒకరికి ఒకవిధమైన సాన్నిహిత్యభావం కుదురుకుంది ఈవిషయంలో సుబ్బారావుదే పై చేయి సుజాత సాధ్యమయినంతవరకు సుబ్బారావుకు తాను ఎదురుపడకుండ చూచుకునేది అయితే సుబ్బారావుమనస్సులో మాత్రం సుజాతపైన మధురభావంకూడ మొలకెత్తింది దానినే నెమ్మదినెమ్మదిగా పెంచుకుంటూ వచ్చాడు అలాంటిస్థితిలోనే సుజాతకూడ ఉండిఉంటుందనుకున్నాడు కాని తానలా అనుకోవడం పొరపాటుపడటమే అవుతుందేమోనని సుబ్బారావుకు తట్టలేదు

రామమూర్తికి తనమనసులోని విషయం చెప్పాడు సుబ్బారావు

'ఇద్దరికీ ఇష్టంఅయితే చేసుకోవడం మంచిదే కాని

ఇద్దరిపెద్దలూ ఒప్పుకోకపోవచ్చు దీనికి" అన్నాడు రామ మూర్తి వాస్తవవిషయాల్ని గుర్తుకుతేవడం మంచిదని

'అసలు సుజాత అంటే నీఅభిప్రాయం ఏమిటి" అని అడిగాడు సుబ్బారావు

ఆవిడంటే నాకెప్పుడూ గౌరవమే ఏ అడ్డంకులు లేకుండ మీయిద్దరికీ పెళ్ళయితే మొదట సంతోషించేవాణ్ని నేనే" అన్నాడు రామమూర్తి సమాధానంగా

సుబ్బారావు తృప్తిగా కృతజ్ఞతతో చూశాడు స్నేహితునివంక

సుబ్బారావు బాబాయికూతురు నీరజకి సుజాతకి ప్రక్కప్రక్కయింటివాళ్ళవడంవల్ల పరిచయం ఒకేవయసు కలవాళ్ళవడంవల్ల స్నేహంకూడా కలిసింది సుబ్బారావు నీరజతో తన స్వంతచెల్లెలికంటె ఎక్కువ చనువుగ, ప్రేమగా ఉంటాడు నీరజ ఏవిషయాన్నైన త్వరగా అర్థం చేసుకుంటుంది నానుభూతికూడ చూపగలవ్యక్తి నీరజ చెవిని కూడ పడింది సుజాత- సుబ్బారావుల విషయం సుజాత మాత్రం నీరజదగ్గరెప్పుడూ తాను సుబ్బారావుని ప్రేమిస్తు న్నట్టు చెప్పలేదు కాని అతనంటే తనకు మంచిఅభిప్రాయం ఉన్నట్టుగామాత్రం వ్యక్తపరుస్తూఉండేది మాటల సంద ర్భంలో

రామమూర్తి వీలుచూసుకుని ఒకరోజు సుబ్బారావు తండ్రితో ఈవిషయం కదిపిచూశాడు ఆయన సుముఖంగా కనపడలేదు సుజాతతండ్రిదగ్గరకుడ ఈ విషయాన్ని రామమూర్తే ప్రస్తావించాడు తనస్నేహితుని తరఫున

ఆయన విని 'మా సుజాతకూడ ఇష్టపడుతోందా?''
అని అడిగాడు

'అనే అనుకుంటున్నాం'' అన్నాడు రామమూర్తి

'సుజాతతో మాట్లాడాలి ముందు నేను'' అని ఊరుకున్నా రాయన

సుజాతతండ్రి చాల సౌమ్యమైన మనిషి. ఎవర్నీ కరుకుగా మాటలనడు. ఆధైర్యంతోనే రామమూర్తి సాహసించి ఈ పెళ్ళిసంగతి ఆయనదగ్గర ఎత్తాడు

ఆరోజు రాత్రే ఆయన భోజనాలయాక సుజాతను పిలిచి అడిగాడు 'నువ్వు సుబ్బారావుని చేసుకుంటానని మాట ఇచ్చావా?'' అని

'లేదు'' అంది సుజాత హఠాత్తుగా తండ్రి అడిగిన ప్రశ్నకి. తరువాత తేరుకుని 'నిజమే చెప్పానుగా ఎప్పుడూ నేను మాట ఇవ్వలేదుకదా'' అనుకుంది మనస్సులో

'తప్పనిసరిగా అతన్నే చేసుకోవాలని నీకుందా?'' అని తిరిగి అడిగాడు తండ్రి

సుజాత ఆలోచనలో పడింది 'నీకు తప్పనిసరిగా చేసుకోవాలనివుంటే నేనేమీ అడ్డుపెట్టను. కాకపోతే మిగతాపిల్లల పెళ్ళిళ్ళవిషయంలో నేను కొంచెం బాధపడవలసివస్తుంది అంతే'' అన్నాడు తిరిగి ఆయన

సుజాత ఆ రాత్రంతా ఆలోచిస్తూనేఉంది. తనకు సుబ్బారావంటే మంచి అభిప్రాయమున్నమాట నిజమే. అంతమాత్రంచేత అతన్నే పెళ్ళిచేసుకోవాలని ఎక్కడుంది? ఆ మాటకొస్తే రామమూర్తి అంటేకూడ తనకి గౌరవం

కాకపోతే సుబ్బారావు తనంటే ఇష్టపడుతున్నాడు కనుక బహుశా తను చాల సుఖపడవచ్చు అతన్ని చేసుకుంటే అనుకుంది ఇంతలో తండ్రిమాటలు గుర్తుకొచ్చాయి "నువ్వతన్ని చేసుకోవడానికి వీల్లేదు" అని తండ్రి ఖరాఖండిగ చెప్పి భయపెట్టిఉంటే బహుశా తనుకూడ 'ఏంచేసుకుంటే తప్పేమిటి? ఎందుకు వీల్లేదు'" అని అనుకునిఉండేది కాని తండ్రి ఒక్కవాక్యంలో సవ్యంగా పరిస్థితుల్ని విడమర్చి మాపాడు తాను అందరిలోక పెద్దపిల్ల మిగతా నలుగురు చెల్లెళ్ళకి ఇద్దరు తమ్ముళ్ళకీ పెళ్ళిళ్ళు కావాలి ముందుముందు ఈ వర్ణాంతరవివాహం ముందు తానుచేసుకుంటే మిగతా వాళ్ళకి సంబంధాలు తేవడానికి తండ్రి చాల కష్టపడవలసి వస్తుంది అయినా సుబ్బారావుతండ్రికికూడ ఈ పెళ్ళి ఇష్టంలేనట్టుగా నీరజ చెప్పింది ఇన్నిగొడవల్లో సుజాతకు సుబ్బారావుని తప్పనిసరిగా చేసుకోవలసిన అగత్యం కనపడ లేదు ఈ సంగతి సుబ్బారావు కెలా తెలియజేయాలీ అనుకుంది అతనికంటే రామమూర్తికే ఈ సంగతి చెబితే మంచి దనుకుంది

మరుచటిరోజు మధ్యాహ్నం సుజాత నీరజదగ్గరకు వెళ్ళి "వీలుంటే రామమూర్తిగారి కొకసారి కబురుపెట్ట గలవా?" అంది

"సంగతేమిటే?" అంది నీరజ

సుజాత చెప్పిందంతా నీరజ మౌనంగా వింది చివరకు "ఇదే నీ తుదినిశ్చయమా?" అంది

"ఇక అంతే" అని తలవంచుకుంది సుజాత

రామమూర్తికోసం పనిచేసేవాడితో కబురుపెడదా మని నీరజ లేవబోతూఉండగా "నీరజా!" అంటూ లోపలికి వచ్చాడు సుబ్బారావు

"రా అన్నయ్యా" అని "ఇప్పుడే వస్తాను" అంటూ నీరజ లేచి లోనకు వెళ్ళింది

సుజాత సుబ్బారావులు అంతకుపూర్వం ఎప్పుడూ ఇలా ఒంటరిగా ఒకళ్ళకొకళ్ళు తటస్థపడలేదు ముఖాముఖీ ఎప్పుడూ ఇద్దరూ చనువుగా మాట్లాడుకోలేదుకూడా కాని సుబ్బారావుమనస్సులో చాలాసార్లు సుజాతతో ఎంతో చనువుగా మాట్లాడుకున్నాడు ఊహల్లో ఎన్నెన్నో చిత్రించుకున్నాడు అతని మనోవీధిలో సుజాత తన కెంతో దగ్గరగా వచ్చేసింది ఇద్దరూ ఒకటేనన్నంత దగ్గరగా వచ్చేసింది ఆ సుజాత అతనికెదురుగా ఆ క్షణంలో ప్రత్యక్షంగా నిలబడిఉంది తలవంచుకుని ఎన్ని వంటింటిలో పనిలోఉంది బాబాయి బయట కెక్కడికో వెళ్ళాడు నీరజ లోన ఎక్కడికో వెళ్ళింది సుజాత సుబ్బారావులు కొన్నిక్షణాలు నీరజగదిలో మౌనంగా నుంచున్నారు

'మాట్లాడొద్దనుకున్నావా సుజాతా?" అన్నాడు సుబ్బారావు నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ

"ఉహు! ఏమీ లేదు" అంది సుజాత

ఏదో నేరంచేసినదానిలా మరింత తల క్రిందకు దించుకుంది తల పైకెత్తలేకపోతోంది 'తననిశ్చయాన్ని చెప్పేద్దామా" అనుకుంది కాని అది ఆ సమయంలో తనకు మించిన పనుకుంది ఇంతలో బయట బాబాయి బూట్ల

చప్పుడు వినిపించింది హమ్మయ్య అనుకుంది సుజాత సుబ్బారావు డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళిపోయాడు సుజాత నీరజగదిలో అక్కడే కూర్చుని టేబుల్ మీది లెటర్ పాడ్ పెన తీసుకుని గబగబా వ్రాసేసింది ఏదో తరుముకొస్తున్నట్టుగా

సుబ్బారావుగారికి

మనిద్దరికి వివాహం జరగడం అసంభవం మన పెద్దల్ని బాధపెట్టి నేనేనాడు ఈ పెళ్ళిచేసుకుందాం అనుకోలేదు మీ రెంతత్వరలో మీ నాన్నగారి కష్టమైన అమ్మాయిని చేసుకుంటే నేనంత సంతోషిస్తాను నన్ను మర్చిపోతే మరీ మంచిది అలా చేయలేకపోతే కేవలం స్నేహితురాలిగా మాత్రమే గుర్తుంచుకోండి

సుజాత

అని వ్రాసి మరో కాగితం తీసింది దానిమీద–

రామమూర్తిగారికి

నేను నా నిశ్చయాన్ని మీ స్నేహితునికి వ్రాసేశాను ఇప్పుడే మీరు ఎలాగైనా వారిని ఒప్పించి వాళ్ళ నాన్నగారికి నచ్చిన సంబంధానికి ఇష్టపడేటట్లుచేసి త్వరగా పెళ్ళయిపోయి కుదుటపడేటట్టు చూడండి ఈ పని మీరొక్కరే చేయగలరని నా నమ్మకం

కృతజ్ఞతతో
సుజాత

అని వ్రాసి రెండూ వేరువేరుగా మడిచిపెట్టి కళ్ళు మూసుకుని నుదురు చేతితోపట్టుకు కూర్చుంది ఇంతలో నీరజ కాఫీకప్పుతో లోనకు వచ్చింది

'కాఫీవద్దు కాని ఈ ఉత్తరం రామమూర్తిగారికి ఇచ్చేయి" అని సమాధానంకోసం ఎదురుచూడకుండా గబగబా యింటికి వెళ్ళిపోయింది

సుబ్బారావు ఉత్తరం చూసుకున్నాక చాల బాధ పడ్డాడు చివరికి నిరాశచేసుకుని ఊరుకున్నాడు ఆతరువాత కొన్ని నెలలకే తండ్రిబలవంతంమీద సుబ్బారావు తండ్రి కుదిర్చిన సంబంధానికి అంగీకరించాడు సుజాత పెద్దలకు భయపడి తనని చేసుకోవడానికి నిరాకరించిందే అనుకున్నాడు కాని సుజాత తనను ప్రేమించలేదేమోనని మాత్రం ఎప్పుడూ అనుకోలేదు

తరువాత కొంతకాలానికి సుబ్బారావుకి మద్రాసులో ఉద్యోగం దొరికి వెళ్ళిపోయాడు సుజాత బి ఎ పూర్తిచేసి టీచరుగా ఒక ప్రయివేటు స్కూలులో పని చేస్తోంది రామమూర్తి ఎం ఎ పూర్తిచేసి తాను చదివిన కాలేజిలోనే లెక్చరరుగా చేరాడు సుజాతవిషయాలు రామమూర్తి అప్పుడప్పుడు వ్రాస్తూఉంటాడు సుబ్బారావుకి

ఒకసారి సుబ్బారావు సెలవుతీసుకుని ఇంటికివచ్చి నప్పుడు నీరజవాళ్ళయింటిప్రక్క సుజాత కనపడలేదు నీరజ నడిగితే యిల్లు మార్చేశారని చెప్పింది

'వాళ్ళనాన్నగారికి జబ్బుగాఉంది ఇప్పుడప్పుడే తను పెళ్ళిచేసుకునే ఉద్దేశ్యంలోలేదట ఈమధ్య వాళ్ళింటికి

వెళ్ళినప్పుడు వాళ్ళమ్మగారు చెప్ప బాధపడ్డారు" అంది నీరజ మాటలసందర్భంలో

అది వినగానే సుబ్బారావుకి మనసులో కెలికినట్లయింది మధ్యలో తను ఆమెజీవితంలో ప్రవేశించకపోతే బహుశా సుజాత అందరిలాగ తలిదండ్రుల కిష్టమైనవాడి నెవరినో చేసుకొనిఉండేది అనుకున్నాడు ఎంతవద్దనుకున్నా సుజాతకు తానేదో అన్యాయంచేసినట్లుగా అనిపించింది 'తనమూలంగానే సుజాత అలాఉండిపోయింది తనమూలాన సుజాత ఏమాత్రం బాధపడకూడదు మంచివాడి నెవనినయినా సుజాత పెళ్ళిచేసుకుని సుఖపడితేనే తనకూ సుఖం అనుకున్నాడు సుబ్బారావు ఈ సంగతి సుజాతకి చెప్ప ఎలాగైన ఆమెను ఒప్పించాలనుకున్నాడు కాని ఆసారి సుజాతని కలుసుకోవడం పడలేదు వెంటనే మద్రాసు వెళ్ళిపోవలసివచ్చింది

నిత్యం ఆఫీసుకు వెళ్ళడం రావడం ఇలా రోజులు గడిచిపోతున్నాయి కాని సుజాతనుగురించి మర్చిపోలేకపోతున్నాడు సుబ్బారావు సుజాత పెళ్ళివిషయం తాను పట్టించుకోవాలనుకున్నాడు రామమూర్తికి సుజాత అడ్రసు తెలుసుకుని వెంటనే తనకు వ్రాయమని ఉత్తరంవ్రాశాడు రామమూర్తిదగ్గరనుంచి వచ్చిన ఉత్తరం చూసుకున్న వెంటనే సుజాతకు ఉత్తరంవ్రాశాడు

'నేను ఎల్లుండి అక్కడికి వస్తున్నాను చూచి చాలారోజులయింది మీ యింట్లోవారికి అభ్యంతరం ఉండ

దనుకుంటాను అలాంటి అభ్యంతరమేకనుక ఉంటే నువ్వు ఎల్లుండి సాయంత్రం మా బాబాయిగారింటికి వస్తే చాల సంతోషిస్తాను" అని రాసినట్టుగానే బయలుదేరాడు ట్రెయిన్‌లో గతించినదినాలు గుర్తుకువస్తూండగా ఏవేవో ఆలోచనలతో సతమతమవుతూ గడిపాడు స్టేషనువచ్చి ట్రెయిను దిగేవరకు

ఇంటిలో సామానువడేసి, స్నానం అదీచేసి "బాబాయిగారింటికి వెళ్లొస్తాను" అని తల్లితో చెప్పేసి వెళ్ళాడు చాల ఆత్రంగా నీరజదగ్గర సుజాత సంగతులేమయినా తెలుస్తాయని

వెళ్ళగానే నీరజ చెప్పింది 'అన్నయ్యా, నిన్ను వాళ్ళింటికి తీసుకురమ్మని సుజాత చెప్పింది ప్రొద్దుటే వచ్చి వెళ్ళింది" అని

నీరజ సుబ్బారావు కలిసి వెళ్ళారు సుజాతయింటికి సుజాతని చూడగానే నిలువునా నీరైపోయాడు సుబ్బారావు ఒక మనిషిలో అంతత్వరలో శారీరకంగా అంతటి మార్పు రాగలదని ఊహించుకోలే దెప్పుడూ తాను

"కూర్చోండి" అంది సుజాత చాల మామూలుగా కుర్చీ చూపిస్తూ

నీరజ "అమ్మగారితో మాట్లాడివస్తాను" అని లోనకు వెళ్ళింది

'చాలా చిక్కిపోయావ్ పోల్చుకోలేనంతగా"అన్నాడు సుబ్బారావు సుజాతతో

'స్కూల్లో పన్నెండూ అందులో నాన్నగారికి ఈమధ్య చాల జబ్బుచేసింది ఇంకా ఆసుపత్రిలోనే ఉన్నారు ఇప్పుడిప్పుడే కొంచం కోలుకుంటున్నారు పనీఅదీ ఎక్కువయి కాస్త చిక్కినట్టున్నాను" అంది సుజాత

చాలా పెద్దరికం వచ్చినట్టుగా ఏవో కొన్ని బాధ్యతలను నెత్తిమీద పెట్టుకున్నట్టుగా కనపడింది పెళ్ళిప్రస్తావన ఎలాతేవాలా అని తికమకపడుతున్నాడు సుబ్బారావు

ఇంతలో సుజాతే అంది 'నాన్నగారికి వ్యాపారంలో చాల నష్టంవచ్చింది చెల్లెళ్లూ తమ్ముళ్లూ ఇంకా చాలచిన్న వాళ్ళు ఇప్పుడప్పుడే నా పెళ్ళిమాట తలపెట్టొద్దన్నాను అమ్మతో " అని

ఆమెమాటలు వింటుంటే అతనికి జాలివేసింది సుజాతపట్ల గౌరవం హెచ్చింది అయితే తాను ఆశించినట్టుగా సుజాత మాట్లాడడంలేదు ఒకవ్వడు ప్రేమించి ఆశాభంగంపొందినట్టుగా నిరాశ ఏమాత్రం ఆమెలో కనపడటంలేదు తనకుటుంబానికి తనచేతనయిన సహాయంచేయడానికి కంకణంకట్టుకున్నట్టుగా ఉంది కాని తానేదేదోగా ఊహించుకున్నాడు ఇంకెలాగో మాటాడుతుందనుకున్నాడు

కాసేపుకూర్చుని నీరజ సుబ్బారావు "ఇక వస్తామని" చెప్పి బయటకు వచ్చేశారు

'ఎంతచెప్పినా ఇప్పుడప్పుడే పెళ్ళిసంగతిఎత్తొద్దనిచెబుతోందటసుజాత ముందు ఎల్లలందరూ ఒకదారినిపడితేనేకాని

తనే పరిస్థితులలోను పెళ్ళిచేసుకోనందట పాపం వాళ్ళమ్మ గారు చెప్ప ఏడ్చారు" అంది నీరజ దోవలో

సుబ్బారావు ఆలోచనలోపడ్డాడు 'బహుశా నేను సుజాతని ప్రేమించినంతగా సుజాత నన్ను ప్రేమించలేదేమో ఆమె ప్రేమిస్తోందని నేనే భ్రాంతిపడ్డానేమో" అనుకున్నాడు సుబ్బారావు అలా అనుకున్న వెంటనే కొంత బరువుతీరినట్టుగా అయింది—సుజాత చిక్కిపోవడానికి పెళ్ళి చేసుకోకపోవడానికి తాను బాధ్యుడు కానందుకు కాని తాను పడ్డది భ్రాంతి అనుకోగానే మరోవైపునుంచి దెబ్బ తిన్నట్టయింది సుబ్బారావుకి

# కళ్లకు కట్టింది

అన్నయ్యకు టైఫాయిడ్ వచ్చిందని తనకోసం కలవరిస్తున్నాడని టెలిగ్రాం రాగానే ఉన్నది ఉన్నట్టుగానే ట్రెయిన్‌కోసంకూడ ఆగలేక కారులో వచ్చిపడింది అన్నయ్య దగ్గరకు ప్రమీల లోనగదిలోకి అడుగుపెట్టగానే వదిన ఎవరో ఆవిడ 'ఒళ్ళో తలపెట్టుకు ఏడుస్తోంది 'ఆవిడ" వదిన తలనిమురుతూ ఓదారుస్తోంది

'ఎలావుంది వదినా అన్నయ్యకి ?" అని అడిగింది ప్రమీల ఆదుర్దాగా

'ఫరవాలేదమ్మా సీత ఊరికే గాభరాపడుతోంది" అంది 'ఆవిడ సమాధానంగా

సీత లేచి పమిట చెంగుతో ముఖంతుడుచుకొని ప్రమీలను లోనకు తీసుకుపోయింది

శేఖర్ చెల్లెల్నిచూడగానే ప్రేమగా నవ్వి 'ఎప్పుడొచ్చావమ్మా ? ఖంగారు ఏమీలేదు మీ వదినసంగతి తెలుసుగా ఊరికె గాభరావడి టెలిగ్రాం ఇచ్చింది" అన్నాడు భార్యవంక కృతజ్ఞతగా చూస్తూ

అయిదునిముషాలకల్లా శేఖర్‌కు కొద్దిగా గ్లూకోస్ నీళ్ళు సీతకు ప్రమీలకు టీ తీసుకునివచ్చింది 'ఆవిడ

'సీతా చూడు రేఖగారు ఎంత కష్టపడుతున్నారో మనకోసం" అన్నాడు శేఖర్

'అవును తల్లిలా కాపాడుతోంది మనల్ని" అంది సీత స్నేహాతురాలు రేఖవంక అసహాయంగా చూస్తూ

ప్రమీల పదిరోజులపాటు అక్కడే ఉంది ఆ పది

రోజులూ రేఖకూడ అసమానం అక్కడేఉండి అన్నిసప ర్యలూ చేస్తూ ఊరికే గాభరాపడే సీతను కోదార్చుస్తూఉంది ఎందుకనో ప్రమీల రేఖలమధ్య స్నేహంగాని పరిచయం గాని వృద్ధికాలేదు శేఖర్‌కు పథ్యంపెట్టాక ప్రమీల తనఊరు వెళ్ళిపోయింది తరువాత ప్రమీల చెప్పినా రేఖ గుర్తుకే రాలేదు అప్పుడప్పుడు వదిన ఉత్తరంలో 'రేఖ నిన్నడిగానని వ్రాయమంది' అని వ్రాసినప్పుడుమాత్రం, క్షణం గుర్తు కొచ్చేది

నాలుగయిదు నెలలకు తిరిగి మరొక టెలిగ్రాం వచ్చింది "వదినకు చాల సీరియస్‌గా ఉంది వెంటనే రమ్మని" ఈసారికూడ ట్రెయిన్‌కోసం ఆగలేక కారులోనే వచ్చేసింది ప్రమీల తన నాలుగేళ్ళ కొడుకుని తీసుకుని ఆతృతగా లోనకు వెళ్ళింది ఒక్కడుగు వెనక్కుపడింది

ఎదురుగా అన్నయ్య చేతులతో ముఖంకప్పుకొని ఉన్నాడు ఆవిడ" రేఖే అతనితల నిమురుతూఉంది ప్రమీల తెల్లబోయింది

"అన్నయ్యా! వదిన కెలాఉంది?" అంది కాస్త ఏహ్యంగా

"రా ప్రమీలా! సీత నీకోసం ఒకటే కలవరిస్తోంది ఖంగారేమీలేదు యబార్షనయి కాస్త గడబిడయింది" అని లోనకు తీసుకువెళ్ళింది రేఖ

ముభావంగా వెళ్ళింది ప్రమీల తాను చూచిన "రేఖ అన్నయ్యతల నిమరడం" దృశ్యమే కళ్ళకు కడు తోంది ప్రతిక్షణమూ

"రా ప్రమీలా! బలే ధ్యాసపోయింది నీ మీద! ఏరి! మీ అన్నయ్యకు చెప్పావా?" అని అడిగింది సీత ప్రమీలను చూడగానే ప్రమీలకు వదినంటే చాలఆపేక్ష

"ఎంత అమాయకమయింది వదిన! అన్నయ్య ఎంతగా మారిపోయాడు!" అనుకుంది ప్రమీల

"రేఖా! చూడు ఆయనకు ప్రమీలకూ కాఫీ తీసుకు రావూ" అంది సీత

రేఖ వంటింట్లోకి వెళ్ళింది

"రేఖే లేకపోతే మేమేం అయిపోయేవాళ్ళమో! ఆమె ఋణం తీర్చుకోలేము" అంది సీత

"ఇంత అచ్చివదినను ఎలా మోసంచేస్తున్నారా వీళ్ళిద్దరూనూ" అనుకుంది కసిగా ప్రమీల అన్నయ్య మీద ఎక్కడలేని కోపమూ వచ్చింది

"మీ అన్నయ్య మరి బెంగపెట్టుకున్నాడు అన్నం అదీ రేఖే సరిగా చూచి బలవంతంచేసి పెడుతోంది" అంది సీత

వదినమాటలు వింటున్నకొద్దీ ప్రమీలకు వదినమీద జాలి అన్నయ్యమీద రేఖమీద కసి అసహ్యం పుట్టు కొస్తున్నాయి "వదినకు జబ్బుగావుంటే వీళ్ళకి వనన్న మాట వదినంటే ప్రాణాలిచ్చే అన్నయ్యేనా ఇలా మారి పోయాడు" అనుకుని తెగతిట్టుకుంది శేఖర్‌ని లోలోన ఒక వారంరోజులపాటు వున్నా ఈసారి అన్నయ్యతో కూడ ముభావంగానే వుంది ప్రమీల సీతకు నెమ్మదించిన తరు వాత వెళ్ళిపోయింది ప్రమీల

ప్రమీల వెళ్ళిన పది పదిహేనురోజులకే తన నాలు గేళ్ళ బాబుకి కడుపులో నొప్పివచ్చింది దానిమీద బాగా 'టెంపరేచర్' కూడాను రెండోరోజుకే అకస్మాత్తుగా చచ్చిపోయాడు బాబు ప్రమీల ప్రాణపడిపోయింది కళ్ళ వెంట నీళ్ళుకూడా రాలేదు ఆవేళంతా రెండవరోజుకి స్పృహలోకివచ్చింది ఒక్కసారిగా కొడుకుచావు గుర్తుకు వచ్చింది కట్టతెగిన ప్రవాహంలా భోరుమంది తన భర్త అన్నగారు వచ్చి పలకరిస్తే కుమిలికుమిలి ఏడ్చింది చేతు లలో ముఖంపెట్టుకుని

'ఊరుకో అమ్మా! ఊరుకో! పోయినవాడు వస్తాడా! నీ ఆరోగ్యం చూడు ఎలావుందో! లే ముఖంకడు క్కుని కొంచెం కాఫీతాగమ్మా" అని ముఖంమీదనుండి చేతులుతీసేస లేవదీస తీసుకువెళ్ళాడు 'బాత్‌రూమ్" లోకి ప్రమీలను ఆయన

ప్రమీల అంతకుపూర్వం ఎప్పుడూ ఎక్కువగా బావ గారితో మాట్లాడలేదు ఆయనకూడ ఎప్పుడూ తనతో చనువుగాలేడు వయస్సుకూడ ముప్పయి ముప్పయిఐదుకి మించవ్ అయినా ఆయన అప్పుడు తన సలా పట్టుకు తీసుకు వెళ్ళుతూంటే సహజంగానే అనిపించింది ఎవరో ఆప్తుడు తండ్రిలాంటివాడు తనని ఓదారుస్తున్నట్టుగా అనిపించింది వదినకు జబ్బుగా ఉన్నప్పుడు రేఖ తన అన్నయ్యకు తల నిమిరిన" దృశ్యం కళ్ళకు కట్టింది ఒక్కసారిగా వెళ్ళి రేఖను గట్టిగా కౌగలించుకోవాలనుకుంది ప్రమీల

# ఎగుడు - దిగుడు

లలిత శేఖర్ నాకు చాల దగ్గర స్నేహితులు వాళ్ళిద్దరూకూడ పెళ్ళికాకపూర్వం ఒకళ్ళకొకళ్ళు పరిచయమున్నవారే కొద్దిపాటి స్నేహితులే అనికూడ చెప్పొచ్చు శేఖర్ నాకు స్నేహితుడే కాకుండా బంధువుకూడా మా శేఖర్ ని చేసుకున్నాక లలితతో కేవలం స్నేహమే కాకుండా చుట్టరికం కూడ కలిసింది శేఖర్ అంటే నాకు అభిమానం ఒక విధంగా జాలికూడాను లలిత నాకంటే రెండేళ్లు చిన్నదైనా ఎందుకో తనంటే అభిమానము గౌరవం నాకు

శేఖర్ ఉద్యోగంకోసం వెతక్క స్వంతంగా వ్యాపారం చేయడం మొదలుపెట్టాడు అతనికి అనుకోకుండా చాల త్వరలో పెద్ద లాభంవచ్చింది అతను అల్పసంతోషి ఎంతో సంతోషపడ్డాడు మమ్మల్నందర్నీ డిన్నరుకు పిలిచాడు లలిత మామూలుగ ఎప్పటిలాగే అందరికీ మర్యాద చేసింది అందరూ అభినందనలు లలిత శేఖర్ లకు అందజేశారు ప్రతిగా లలిత ధన్యవాదాలర్పించింది కాని నాకెందుకో శేఖర్ లో ఉన్నంత అమితోత్సాహం లలితలో కనపడలా చాలా మామూలుగా ఉంది అందరూ వెళ్ళిపోయారు నన్ను ఆ రాత్రికి వాళ్ళింట్లోనే ఉండమని బలవంతంచేశారు ఇద్దరూ ఉండిపోయాను లలిత సామాను అదీ సర్దుకుంటూ ఉండగా 'లలితా కంగ్రాచ్యులేషన్స్" అన్నాను ప్రత్యేకంగా

'దేనికీ" అంది ఒక్కసారి తెల్లబోయి మళ్లా వెంటనే గుర్తు తెచ్చుకొని 'ఓహో మాకు వ్యాపారంలో లాభం వచ్చిందనా అవునూ నిజంగానే వాళ్ళందరూ అభినంద నలు చెబుతూఉంటే నాకు చాల తమాషా అనిపించింది నువ్వు నమ్మవేమోగాని నేను నిన్నటినుంచి 'చాలా లాభంవచ్చింది లాభంవచ్చింది అని పదేపదే గుర్తుకు తెచ్చుకుంటున్నాను లేకపోతే అంత ప్రత్యేకంగా గుర్తుండ దేమోనని భయం" అంది లలిత

శేఖర్ గదిలోకి వస్తూ లలితమాటలు విన్నాడు 'లలితా పరాయివాళ్ళందరికికూడ అంత సంతోషంగా ఉంటే నీ కెందుకని అంతఉపాహగా లేదు నేను ఎంతో సంబ రంగా మొట్టమొదట నీకు చెప్పాలి నువ్వు విని ఎంత సంతోషపడతావో చూడాలి అనుకుంటూ ఎంతో ఆశతో ఇంటికివచ్చి నీతో చెప్పాను విని అవునా బావుంది అన్నావు అక్కడికీ దెబ్బతిన్నట్టు కనపడకుండా 'స్నేహి తులంతా పార్టీ ఇవ్వమంటున్నారు రేపు డిన్నరుకు పిల వనా అంటే 'తప్పకుండా అన్నావు అంతే మళ్ళీ ఆ సంగతే ఎత్తలేదు నువ్వు" అన్నాడు శేఖర్ మనస్సు కష్ట పెట్టుకుంటూ

'నేనేం చేయను అది మామూలు రొటీన్‌గా కన పడింది అక్కడికీ చాలా ప్రయత్నించాను చాలసంతో షంగా కనపడాలి అని ఆమాట వినగానే నాకూ సంతో షం వేసింది ఇంకా ఎక్కువ ఎక్కడనుంచి తెచ్చుకోను?"

అంది లలిత నీళ్ళుతిరిగిన కళ్ళను మాకు కనపడనీయకుండా ముఖం కిందికి దించుకుంటూ

'సంతోషపడాల్సినప్పుడు సంతోషపడి విచారం కలిగినప్పుడు విచారిస్తేనే కాని ఏమిటో నాకు మనుష్యులు లాగా కనపడరు దేనికీ చలించకుండా ఉంటే శిలల్లాగా అని పించరూ ఇంక లైఫ్ ఏమిటి?" అన్నాడు శేఖర్

ఇద్దరిమధ్యా అఘాతాలు ఏర్పడడం మొదలు పెట్టాయి అలాగే రెండేళ్ళు గడిచాయి ఆ రెండేళ్ళల్లో శేఖర్ని తృప్తిపరచడానికి లలిత ఎంతో తనని తాను మార్చుకొని సరిపుచ్చుకోవడానికి ప్రయత్నిస్తూఉండేది

మొదట ఒక్కసారిగా లాభాలువచ్చిన వ్యాపారం ఒక్కసారిగానే పడిపోయింది అసలుకే మోసం వచ్చింది శేఖర్ తట్టుకోలేకపోయాడు జబ్బుపడ్డాడు శేఖర్ తట్టుకో లేక బాధపడుతున్నాడే అన్న దిగులుతప్ప నష్టం వచ్చిం దన్న దిగులు ఏ కొంచెమూ కనపడలా లలితలో 'వ్యాపారం అన్నాక లాభం నష్టం రెండూఉంటాయిగా ఇది పెద్ద అనుకోనిసంఘటనగా నాకేమీ కనపడటం లేదు" అంది లలిత

నాతో నేను వాళ్ళింటికి చూద్దామని వెళ్ళినప్పుడు తను లెక్చరర్ గా చేరింది ఆర్థికంగా ఇబ్బంది ఉండదని శేఖర్ని ఉద్యోగం చేయమని బలవంతపెట్టలేదు వంటింట్లో శేఖర్కి గ్లూకోజ్నీళ్లు కలుపుతూ 'శేఖర్ కింకా పసితనంకదూ!" అంది లలిత

గ్లాకోస్ నీళ్లు తాగుతూ పనిమీద లోనకు వెళుతున్న లలితవంక ఏదో ఆరాధనతో చూశాడు శేఖర్ 'లలిత దేవత కదూ ఎందుకో నాకనిపిస్తుంది తన స్థాయికి నేనీ జీవితంలో చేరుకోలేనేమోనని ఏ పరిస్థితుల్లోనైనా ఎంత హుందాగా, నిదానంగా ఉంటుందో చూశావా!"అన్నాడు శేఖర్ లలితమానసిక స్థాయిని గుర్తించి

అందుకే నాకు, ఎగుడుదిగుడులకు అతీతంగా ఉండే లలిత అంటే గౌరవం వాటికి వశమయ్యే శేఖర్ అంటే జాలి

# భవిష్యత్తు వైపుకు

రామి 'నవవిలాస్ హోటల్లో పనిచేస్తోంది తన పది హేనవ ఏట ఆపనిలో కుదిరింది మూడేళ్ళుగా ఇడ్లీకి దోసె లకి పిండిరుబ్బడం, అంట్లుతోమడం రామికి తప్పడంలేదు తప్పించుకుందామనికూడ రామి ఎప్పుడూ అనుకోలేదు పైగా త నిప్పుడు ఏ ఆధారమూ లేకుండా ఏకాకిగాఉంది ఈపనే లేకపోతే నానాఅవస్థలు పడవలసివచ్చేది

పద్దెనిమిదేళ్ళు పూర్తిగానిండని రామికి అంట్లుతో ముతూ గతస్మృతులను నెమరు వేసుకుంటూ కళ్ళనీళ్ళు పెట్టు కోవడం అలవాటయింది

రెండేళ్ళక్రితం ఒకరోజురాత్రి తొమ్మిదయిఉం టుంది హోటలునుంచి ఇంటికి వెడుతోంది రామి వెనక నుంచి నరసయ్య 'ఏయ్ పిల్లా నిన్నే'' అని పిలిచాడు

'ఎవరో'' అని భయపడిపోయింది రామి

నువ్వు నవవిలాస్ హోటలులో పనిచేస్తున్నావ్ ని పేరు రామి కదూ?'' అన్నాడు నరసయ్య

అప్పటికి కొంచెం ధైర్యంతెచ్చుకుని ''అయితే నీకేం?'' అంది రామి

'నీకు అమ్మ, అయ్య లేరు నీ మామ పెంచు తున్నాడు నిన్ను'' అన్నాడు మళ్ళీ నరసయ్య

''నీకెందుకు నాజోలి?'' అంది రామి కొంచెం కోపంగా

''ఎందుకా! నాకు కాకుండా నీ సంగ తింకెవడికి పట్టినా ముక్కలు ఇరగదన్నుతా ఆడిని నిన్ను పెళ్ళిచేసు

కుని, నా దాన్నిగా చేసుకుంటానే రామీ నిన్ను!" అన్నాడు నరసయ్య

రామి కేమనాలో తోచలేదు 'పెళ్ళిచేసుకుందా మనుకుంటే ఇదా ఇదానం రేపు మా మామ నొచ్చ డుగు" అంది రామి తేరుకుని

"చాలు నీ కిష్టమో లేదో ముందు తెల్సుకుందా మని ' అన్నాడు నరసయ్య

రామి సిగ్గుపడింది నరసయ్యవొరవ చూసి అబ్బుర పడింది 'మా మామ నడుగు" అని అడుగు ఇంకొంచెం తొందరగా వేసింది ముందుకు రామి

'సరే రేపొద్దున్నొస్తాలే మీ యింటికి" అంటూ వెళ్ళిపోయాడు నరసయ్య

నరసయ్య రోజూ నవవిలాస్ హోటలు కొచ్చి 'టీ తాగిపోవడం తలవంచుకుని ఇంటికినడుస్తున్న రామికి గుర్తు కొచ్చింది అదీ! రోజూ నన్ను హోటలులో చూస్తున్నా డన్నమాట!" అనుకుంది

మరుచటిరోజు నరసయ్య రామిమామ నడిగాడు ఓలికింద పాతికరూపాయలు తన కిస్తే రామినిచ్చి పెళ్ళి చేయడానిక ఒప్పుకుంటానన్నాడు రామిమామ

"సరే" నన్నాడు నరసయ్య

అంతే తర్వాత నాలుగురోజుల్లోనే రామి నరసయ్య దయిపోయింది

ఇద్దరూ ఒకటేమనసుగా గడిపారు రెండేళ్ళపాటు అంతే ఒకరోజు వారాత్తుగా కన్నుమూశాడు నరసయ్యకలరావచ్చి

రామి ఏకాకయింది బతుకు మోడు బారినట్టయింది నరసయ్యని మర్చిపోలేకపోతోంది రామి

రామి—నిండా పద్దెనిమిదేళ్ళులేని రామి—ఒంటరిగా గుంభనగా బ్రతకలేకపోతోంది హోటలులోవాళ్ళ వెకిలి మాపులు పరనాలు రామిని గాభరాపెడుతున్నాయి

హోటలుసర్వరు వెంకటేశు రామిని మారుమనువు చేసుకోమంటున్నాడు రోజూ రామి ఒప్పుకోలేదు ఒక రోజు చీకటిపడింది రామి కప్పులుకడుగుతుంటే ఎవరో వచ్చి బుజంమీద చెయ్యివేశారు రామి ఆ చెయ్యిని తీసి విసిరికొట్టి కప్పు లక్కడే పెట్టేసి గబగబా హోటలుగది లోకి వచ్చేసింది ఉబికుబికి దుఃఖం పొర్లుకువచ్చింది తానిక ఒంటరిగాఉండటం మంచిదికాదనుకుంది వెంకటేశు అంతకు క్రిందటిరోజే అన్నమాటలు గుర్తుకొచ్చాయి 'ఇవాళ కాకపోతే రేపయినా వెలుసది నీకు అండలేందే బతక లేవని నీ బతుకంతా ముందలఉంది సిన్నదానివి ఎందుకు పాడుచేసుకుంటావ్ నీ బతుకుని?'' అని అన్నాడు వెంక టేశు భవిష్యత్తును చదివి చెప్పినట్టు

నిజమే తనబతుకంతా ముంకుంది తనకి పిల్ల లంటే ఎంతముద్దు! తనకి పిల్లలుంటే ఎంత బాగుండునని ఎన్నిసార్లో అనుకుంది తను మళ్ళ ఒకయింటిదవాలి పిల్లా జెల్లాతో ఇల్లు కలకలలాడాలి'' అనుకుంది రామి

మరుచటిరోజే చెప్పింది వెంకటేశుతో 'నా కిష్టమే మారుమనువు సేసుకోవడం'' అని రామి

# నిజం నిష్ఠూరం

తెల్లవారుఝాము అయిదైఉంటుంది 'అయ్యో కూతురా! మమ్మల్నొదిలి వెళ్ళిపోయావా తల్లీ! అని ఎవరో ఏడుస్తున్నట్టుగా వినపడింది మొదట కలేమో అనుకున్నాను పూర్తిగా మేలుకుని వింటే నిజంగానే ఎవరో, మా యింటిప్రక్కగానే ఏడుస్తున్నట్టు వినిపించింది ఇంకా జాగ్రత్తగా వింటే, ఒక్కరేకాదు, నలుగురయిదుగురు ఏడుస్తున్నట్టుగా వినిపించింది నేను ప్రక్కమీదినుంచి లేచి వీధిలోకి వెళ్ళాను

మా ఇంటిపక్క కామాక్షమ్మగారిగుమ్మంలో జనం మూగిఉన్నారు పదిమందిదాక కామాక్షమ్మగారి ఏడేళ్ళ కూతురు సునంద రాత్రికిరాత్రి కలరావచ్చి చచ్చిపోయిందట అక్కడికీ ఆరాత్రి ఇద్దరుడాక్టర్లను పిలుచుకొచ్చినా లాభంలేకపోయిందట

అప్పుడు జ్ఞాపకంవచ్చింది రాత్రి మూడుగంటల ప్రాంతంలో కామాక్షమ్మగారిఇంటికి కార్లు రావడం గడబిడగా మాటలు వినిపించడం

మా యింటిచుట్టుప్రక్కల నాలుగయిదురోజులుగా ఎవరోఒకరు కలరావచ్చి పోతున్నారు పాపం! కామాక్షమ్మగారికూతురు సునంద ఎంతో ముద్దుగాఉండేది — అందరికీ చిలకలా కబుర్లుచెబుతూ పువ్వులాంటి పిల్ల మట్టిలో కలిసిపోతోందంటే మనసు వికలమైపోయింది

అలాగే నుంచున్నాను ఆ వాడకట్టులో చాలమందిఇళ్ళల్లో పనిచేసే ఎరికిలి 'నాగి పనిలోకి వెడుతూ జనం మూగి ఉండటం చూచి ఆగింది

"ఏమైందమ్మా?" అని అడిగింది నాగి

'కలరావచ్చి వాళ్ళమ్మాయి చచ్చిపోయింది" అన్నాను

"అయ్యో" అనుకుంటూ వెనుతిరిగి వెళ్ళిపోయింది 'నాగి గుడిసెవైపు చూశాను గుడిసెముందు పడుకునిఉన్న ముగ్గురుపిల్లల్ని తడిమిచూసుకుంటోంది 'నాగి

ఆరోజుసాయంత్రమే కూరలవాడిని కేకవేద్దామని వీధిగుమ్మంలోకి వచ్చాను నాగిగుడిసెలోనుంచి ఏడుపు వినిపించింది నాగిగుడిసెకి మా యింటికి మధ్య రోడ్డు ఖాళీ స్థలమే అడ్డు గుడిసెవైపుగా వెళ్ళాను నన్నుచూసి నాగి ఇంకా బావురుమంది వడిలోఉన్న పెద్దకూతుర్ని చూపింది మధ్యాహ్నం మళ్ళీ పనిలోకివెళ్ళి తిరిగివచ్చేటప్పటికే, డోకులు విరేచనాలువెళ్ళి చచ్చిపోయి పడిఉందట

ఆ పిల్లకీ సునందఈడే ఉంటుంది రెండోపిల్లకి నాలు గయిదేళ్ళుంటాయి మూడోవాడికి రెండేళ్ళుంటాయేమో! ఆ ఇద్దరుపిల్లలూ తల్లి ఏడుపు చూసి బెంబేలుపడి ఏడుస్తూనే 'బువ్వపెట్టు బువ్వపెట్టు"అని తల్లికొంగుపట్టుకుని మారాం చేస్తున్నారు

ఇంతలో ఎవరో ఇద్దరుముగ్గురు ఎరుకలవాళ్ళు వచ్చి శవాన్ని తీసుకుపోయారు పాతిపెట్టడానికి పిల్లలిద్దరూ ఇంకా గట్టిగా ఏడవడం మొదలుపెట్టారు, 'బువ్వ బువ్వ"అంటూ

"ఈళ్ళబాబు చచ్చి రెండేళ్ళయింది, పిల్లల్ని నా యదాన పడేసి పోయాడు పిల్లచచ్చిందనే ఏడవనా ఈళ్ళకు బువ్వలేదనే ఏడవనా అమ్మా!" అంటూ మరింత భోరున ఏడ్చింది నాగి

రెక్కాడితేకాని డొక్కాడని నాగి మూడోరోజు పనిలోకి వెళ్ళడం మొదలుపెట్టింది

'కూతురు చచ్చి రెండురోజులు కాలేదు అప్పుడే నాగి ఎలా పనిలోకి వెళుతోందో! కామాక్షమ్మగారు చూడు అన్నం నీరు ముట్టకుండా ఆవిధాన ఎలా పడి ఉందో ఆ! ఎంతైనా అలగావాళ్ళకు ప్రేమలు అపేక్షలూ ఉంటాయా?" అంది అమ్మమ్మ నాగదీసుకుంటూ

"నువ్వు మరి అమ్మమ్మా పనిలోకి వెళ్ళకపోతే నువ్వు పెడతావా తిండి నాగికి పిల్లలకి? కామాక్షమ్మ గారికీ నాగికీ పోలిక తెస్తావేమిటి? ఆవిడ డెన్నిరోజులు బాధ పడుతూ పడుకున్నా నాగుతుంది మరి" అన్నాను

'అన్నీ పెడసరంమాటలూ నువ్వూనూ" అని సణుక్కుంది అమ్మమ్మ

'అంతేలే నిజంచెబితే నిష్ఠూరమే మరి" అని నేను అక్కడినుంచి లేచి వెళ్ళిపోయాను

# వెలుగు నీడలు

వీరయ్య ఆసుపత్రివరండాలో ఎంతో ఆదుర్దాగా కూర్చున్నాడు ఆరోజు మిల్లుకువెళ్ళినా పనిలో మనసు పెట్టలేకపోయాడు సెలవడిగి వచ్చేస్తూవుంటే 'ఏం వీరయ్యా! నీ ఆడంగులేనా కడుపుతోఉంది - లోకంలో ఇంకెవరూ లేనట్టూ ఎందు కంత గాభరాపడిపోతావ్'' అని హేళనచేశాడు రంగయ్య వీరయ్యకి ఆరోజు ఇల్లువదిలింది మొదలు దిగులుగానే ఉంది మల్లే నిండుగా, నీరసంగా కళ్ళల్లో మెదుల్తోంది

మొదటిసారి కాన్పుకి చాలా కష్టపడింది మల్లి పుట్టబోయే ఎల్లవాణ్ణి ఊహించుకుని ఎంతో మురిసిపోయేది

'నీలాగ కూలిపని చేయడు నా నాయన పెద్ద దొరబాబవుతాడు'' అనేది మల్లి

తీరా బాబుపుట్టబోయేరోజొచ్చేటప్పటికి మల్లి డీలాపడిపోయింది సంగలిముసలమ్మని తీసుకొచ్చాడు వీరయ్య తను అరుగుమీద కూర్చున్నాడు ఎల్లవాడిఏడుపు ఖంగున ఇంకా వినిపిస్తుంది ఇంకా వినిపిస్తుందని ఎంత కాచుకూచున్నా లోన మల్లి మూలుగే ఇంకా వినపడుతోంది లోన మల్లి మూలుగూ తగ్గడంలేదు బయట పట్టిన ముసురూ తగ్గడంలేదు

ఇంతలో ముసలమ్మ తలుపుతీసి ''ఆసుపత్రికి తీసుకెళ్ళాలి'' అని చెప్పింది ముసురంటే మల్లికి దిగులు

"ముసురుపడితే పగలూ చీకటయిపోద్ది రాత్రి చికటే పగలూ చీకటేనా మామా ?" అంటుంది వీర య్యతో ముసురుపట్టిందంటే

ఆ ముసురులోనే త్వరత్వరగా బండిమాట్లాడి, సగం స్పృహలో సగంమగతలోఉన్న మల్లిన గ్రుడ్లనీరు గ్రుడ్ల కుక్కుకుని, రెండుమైళ్ళదూరంలోఉన్న పట్నంఆసుపత్రికి తీసుకుని వెళ్ళాడు వీరయ్య

'తల్లి ప్రాణానికీ పిల్లప్రాణానికికూడ ప్రమాదమే అయినా గాభరాపడకు చూస్తాం తీసుకురావడం ఆలస్యం చేశావ్" అని అక్కడి డాక్టరు గారంటే నిలువునా కూలి పోయాడు వీరయ్య

అలాగే ఆసుపత్రివరండాలో కూర్చుండిపోయాడు మూడేళ్ళబట్టి మనసూ మనసూ కలిపి తనతోఉన్న మల్లి తనని విడిచివెళ్ళిపోతే ఇంక తన బ్రతుకేముంది అసలు పెళ్ళికాకముందుకూడ ఎంత ప్రాణంఇచ్చేది తనంటే 'మావా మావా అని తనంటే పడిచచ్చిపోయేది మల్లి కేమన్నా అయితే తన బతుకెందుకు? అనుకున్నాడు వీరయ్య

ఇంతలో నర్సు బయటకొచ్చి 'పిల్ల కడుపులోనే చచ్చిపోయింది తల్లికేమీ ఫరవాలేదు" అని చెప్పింది వీరయ్య అపుకుంటున్న దుఃఖంతో వచ్చే వెక్కింతోపాటతో నర్సుకు దణ్ణంపెట్టాడు రెండుచేతులూ జోడించి కాని మల్లి ఎన్నెన్ని ఊహించుకుంది కొడుకునుగురించి ఆ ఊహా లన్నీ పుటుక్కుమన్నాయి

మునురు తెరిపిచ్చింది కొద్దికొద్దిగా సూర్యుడు కనపడ్డాడు ఎల్లి చచ్చిపుట్టింది మల్లి మనసుపై నీడలుపడ్డాయి మల్లి బ్రతికింది వీరయ్యమనస్సుపై వెలుగులానాయి

నెమ్మదినెమ్మదిగా కోలుకుంది మల్లి మల్లి పోయిన ఎల్లని తలుచుకుని దిగులుపడితే వీరయ్య ఓదార్చేవాడు

మళ్ళీ మల్లి కడుపుతోవున్నపుడు,వీరయ్య కా సంగతి చెప్పడానికి ఎంతో సిగ్గుపడింది వీరయ్య కొండంత సంబరపడ్డాడు ఆసంగతి విని మల్లి ఏదికావాలంటే అది తెచ్చేవాడు

మొదటిసారిలాగ కాకుండా రెండవసారి ముందుగానే ఆసుపత్రికి తీసుకొచ్చాడు మల్లిని ఆసుపత్రిలో దింప 'పురుడు సాయంత్రంవరకూ రాదంటే వీరయ్య మిల్లులోకి వెళ్ళాడు తీరా వెళ్ళినా మనసునిలవక సెలవుపెట్టి వచ్చేశాడు

అలా వరండాలో కూర్చున్న వీరయ్య మెదడులో ఎప్పటెప్పటి సంగతులూ మెదలుతూవచ్చాయి ఇంకా సాయంత్రంకాకముందే లోపల్నుంచి కెవ్వున పసిపాప ఏడుపు వీరయ్యని ఆలోచనల్లోనుంచి తేరుకోమని ఛ్రున వీపుచరిచినట్టుగా వినిపించింది

విరయ్య లేచి నుంచున్నాడు 'నా మల్లిపాపేనా మరే తల్లి పాపైనానా ?''అని సంతోషం-గాభరా, ఆశ - నిరాశల మాధ్యన ఊగులాడుతున్నాడు వీరయ్య క్రిందటిసారి నర్సే

నవ్వుతూ వచ్చి "ఏం వీరయ్యా ఎల్ల కావాలా ఎల్ల వాడు కావాలా?" అని అడిగింది తను సంతోషంతో ఏమీ చెప్పలేక దణ్ణంపెట్టి ఊరుకున్నాడు

'ఎల్లవాడేలే!" అని నవ్వుతూ చెప్ప, వెళ్ళి పోయింది నర్సు క్రిందటిసారి మల్లి బ్రతికిందనే సంతోషానికి తోడు, నీడగా పిల్లపోయిందనే బాధ

ఈసారి అంతా వెలుగే వీరయ్యకి మల్లికి!

# ఎక్కడికి పోస్టుచేయను?

అన్నయ్యా !

ఎచ్చిగా నేను నీకు ఉత్తరం వ్రాస్తున్నందుకు నవ్వు నీవు లేవనేబాధ రెండూ కలిసి గా నేదిం అక్షరాలరూపంలో రూపందిద్దుకుంటోంది

అన్నయ్యా! నీకు గుర్తుందిగా నువ్వు బ్రతికుండగానే నాకు పెళ్ళయింది అందర్నీ వదలుకొని కేవలం నామీద ఎచ్చి ప్రేమతో నన్ను చేసుకున్నారాయన ఇప్పు డాయన నన్నంత ప్రేమతో చూడటంలేదనుకుంటున్నావేమో! ఆయన ప్రేమలో ఎలాంటి అపనమ్మకమూ లేదు నాకు

ప్రపంచంలో ఎవ్వరూ ఆయనకంటె నన్నెక్కువగా ప్రేమించలేరనుకునేదాన్ని కాని ఒక్కరున్నా రన్నయ్యా "ఎవరూ అమ్మేనా?" అంటావేమో నీవు ఏమో అమ్మ సంగతి నాకు తెలియదు నేను నెలలపిల్లప్పుడే మనఅమ్మ చచ్చిపోయిందిగా! అమ్మఫోటోను చూసి పెద్దయ్యాక 'నాకు అమ్మలేదు' అని ఏడుస్తూవుంటాను నాలో నేనే అయితే ఇంకెవరంటావేమో! మొన్న సరసి వచ్చి ఏదో మాటలమీద 'మా అన్నయ్య మేము రాత్రి సినిమాకు వెళ్ళొచ్చాం" అంటే ఆరోజు నీకోసం ఎంత ఏడ్చానో చెప్పలేను

నాకు పదిహేనవయేట స్ఫోటకంవచ్చింది గుర్తుందా? 'దురదపెడుతోం దన్నయ్యా కండలు పీకేసుకోవాలని ఉంది" అని ఏడిస్తే నీచేతులతో నా కాళ్ళు చేతులు మెడ నెమ్మదిగా రాస్తూవుండేవాడివి స్ఫోటకంపొక్కులు చితికి నీచేతులకు రసి అంటేది నీ వలా రాస్తూవుండగా ఊరికే

కళ్ళుమూసుకున్నా నొకరోజు నేను నిద్రపోయాననుకొని, పిన్ని నిన్ను ప్రక్కగదిలోకి పిలిచి నిన్న లోషన్‌నీళ్ళతో చేతులుకడుక్కోమని ఇంకెప్పుడూ అలా చేతులతో రాయొద్దని మశూచికంవచ్చినవాళ్ళదగ్గరకు అసలు వెళ్ళడమే మంచిదికాదని ఏవేవో చెప్పింది ఇంతలో 'అన్నయ్యా'' అని పిలవగానే నాదగ్గరకు వచ్చి పిన్ని చెప్పిందంతా మర్చిపోయి మామూలుగా చేతులురాయడం మొదలుపెట్టావ్

పిన్ని మాటలు వినేవరకూ నాకు తట్టలేదు, నాది అంటురోగమని అందుకనే పిన్ని నీతో చెప్పనమాటలు విన్నానని చెప్పకుండ 'దురదలు తగ్గిపోయా యన్నయ్యా! ఇంకా రాస్తే మంటపుడుతుంది'' అనేదాన్ని నువ్వు నావక్కమీద కూర్చుంటే చిరాకుగాఉందని చెప్పి వేరే కుర్చీవేసుకు కూర్చోమనేదాన్ని నిన్న కాని నిద్రలో దురదపెడితే గోక్కుంటూవుండేదాన్ని కాబోలు నేను లేచేటప్పటికి మళ్ళీ నా చేతులు కాళ్ళు నెమ్మదిగా రాస్తూఉండేవాడివి

నా పెళ్ళయినరెండేళ్ళకు కాబోలు నీకు క్షయ వచ్చింది 'నాకీమధ్య జ్వరంతగులుతోంది వంట్లో బావుండటం లేదు మంచం ఎక్కలేదులే గాభరాపడకు'' అని మూడు పేజీలవుత్తరంలో మూడుముక్కలుమాత్రం నిన్నుగురించి వ్రాశావ్

ఉండబట్టలేక వచ్చాను నీదగ్గఱకు కాస్త తేటగా కనపడాలని నవ్వుతెచ్చిపెట్టుకున్నావ్!

పిన్ని నన్ను చాటుకుపిల్చి ''డాక్టరు క్షయఅని చెప్పాడు నేను చెబితే విన్నట్టేవిన్నా దొంగచాటుగా సిగరెట్లు బాగా త్రాగుతున్నాడు'' అంది

నేను వచ్చిన రెండుగంటలవరకు దగ్గును ఎంతో కష్టం మీాద ఆపుకున్నాన్ అబ్బ! ఆరాత్రి ఎంతసేపు దగ్గా వన్నయ్యా-'బాత్ రూమ్ లోకి, పడకగదిలోకి నాకు వినబడ కూడదని తలుపులుమూసి మరీ వెళ్ళి ఒకఅరగంటదాక దగ్గి లోనకువచ్చి పడుకున్నావ్ అలసిపోయావని నిన్నేమీా పలక రించకుండా ఊరుకున్నాను నీరసంగా పడుకున్నాక్ అన్నయ్యా నీకు గుర్తుందా? చిన్నప్పట్నుంచీ నా కదో అలవాటు నావక్క-మీాదనుంచి లేచివచ్చి నీకాళ్ళగట్టున పడుకునేదాన్ని నువ్వు కప్పుకున్నరగ్గులోకి నన్ను లాక్కునే వాడివి ఆరోజునకూడ నీకు కాళ్ళుపడుతూ అలాగే నీకాళ్ళ మీాద తలపెట్టుకుని నిద్రపోయాను పన్ని నేనింకా లేవలేదని లేపడానికి వస్తే మునుపటిలాగ మనమిద్దరం రగ్గుకప్పుకుని పడుకునివున్నామట తరువాత నీకు మినపకుడుం ఒకేప్లేటులో పెట్టి, నాకు మరోప్లేటులో వుప్మాపెట్టుకుని తీసుకువచ్చాను మంచినీళ్లు మర్చిపోయి ఒక్కగ్లాసే తెచ్చాను నువ్వు మినప కుడుం సగంతిని వదిలేసి మంచినీళ్లు తాగావు నాకు కొలక మారితే గ్లాసులోమిగిలిన నీళ్ళను తాగేశాను పన్ని తెల్ల బోయిచూచింది ఎందుకో అనుకున్నాను

ఆమధ్యాహ్నం 'అన్నయ్యమీాద ఎంతప్రేమవున్నా, క్షయ ఎలాంటిజబ్బో నీకు తెలుసుగా రాత్రి అన్నయ్యని కావలించుకుని పడుకున్నావ్ ప్రొద్దుట అన్నయ్యఎంగిలినీళ్లు త్రాగావ్ కాస్త జాగ్రత్తగా వుండకపోతే ఎలా? అసలే నువ్వు బలహీనపుమనిషివి"అని హితవుచెప్పింది పన్ని నాకు కావి రాత్రి మళ్ళీ పన్ని చెప్పినమాటలు మర్చిపోయి పెరు గన్నం చేదుగావుందని నువ్వువదిలేస్తే మళ్ళీ వేరే నేను

పెరుగేసుకోవడం ఎందుకని నువ్వువదిలిన పెరుగన్నం తినే శాను

తిరిగి నేను అత్తవారింటికి వెళ్ళకముందే ఒకరోజు ప్రొద్దుటే ఏడుగంటలప్రాంతంలో బాగా దగ్గొచ్చి బాగా రక్తంకూడా పడింది రోజూలాగానే రక్తంపడిందనుకున్నాను దగ్గిదగ్గి నీరసంగా నాఒళ్ళో ముఖంపెట్టుకొని ఒకనిమిషం వెక్కివెక్కిఏడ్చావ్ నీ వెన్నురాస్తూ అలాగే నాకు తెలియకుండానే నేనూ ఏడుస్తున్నాను

ఇంతలో డాక్టరువచ్చి నీ నాడిచూచి పెన్నితో 'ప్రాణం ఒకనిమిషంక్రిందటే పోయినట్టుంది" అంటున్నారు

డాక్టరు అంతవిపులంగా చెపుతున్నా నాకేమీ అర్థం కాలేదు అప్పుడూ అలాగే నీ వెన్నురాస్తూనేవున్నాను ఇంతలోనే ఎన్ని నాన్న అందరూ బిగ్గరగా ఏడవడం నిన్ను నా వడిలోనుంచి తీసేయడంమాత్రం గుర్తుంది ఆతరువాత రెండురోజులకు కాబోలు నేను మామూలుస్థితికి వచ్చాను చూస్తే ఎదురుగా నీ మంచం బోసిగా కనిపించింది ఇంకా ఏమిటో నా ఎచ్చి-నువ్వు ఏ 'బాత్ రూమ్"కో వెళ్ళావను కున్నాను

నువ్వుచచ్చిపోయి ఆరేళ్ళయింది కదన్నయ్యా! నా కేమిటో ఆరునిమిషాలయినట్టుంది ఇంతకీ నిన్న ఎక్స్‌రే తీయిస్తే డాక్టరు నాకు టి.బి.యనీ ఏ మదనపల్లో పంపడం మంచిదనీ చెప్పాడు నాకేం పెద్ద బాధకలగలేదు గంట క్రితం ఆయన ఆఫీసునుంచి వచ్చారు నా గదిలోకి మంచినీళ్లు కావాలన్నారు అలవాటుచొప్పున నాగదిలోవుండే కూజా దగ్గర ఎప్పుడూ ఒకగ్లాసేవుంటుంది ఎప్పుడూ ఇద్దరం ఆ గ్లాసు

తోనే తానే వాళ్ళం నీకు తెలుసుగా ఎంత వంట్లో బాగో
పోయినా, పడక వేయనని తిరిగి అదీఇదీ చేస్తూనేవుంటాగా
నేను తాగి వదిలిన నీళ్ళింకా గ్లాసులో అలాగే వున్నాయి
పారబోయడం మర్చిపోయినట్టున్నాను అవి పారబోసి మళ్ళీ
దానిలో ఆయనకోసం నీళ్లునింప ఇవిగో మంచినీళ్ళు" అ
నేను అటుతిరిగాను ప్రక్క భోజనాలగదిలో ఆయన మం
నీళ్ళు తాగుతూ కనిపించాడు అప్పుడు గుర్తుకొచ్చిం
నాకు నాకు వచ్చింది క్షయ అనీ నాది అంటురోగమనీ
ఆయనఆరోగ్యం ఆయన చూచుకోకపోతే ఎలా? ఆయ
జాగ్రత్తలో ఆయనవుండటం మంచిదే ఉండా
కూడాను కాని తమాషాచూశావా? అంత ప్రేమల
కూడ నేనుతాగినగ్లాసులో తాను మంచినీళ్ళు తాగకూడ
అనేది వెంటనే తట్టిందాయనకు నా మశూచికపు పొక్కు
చితికి నీచేతుల్నిండా రసి అంటుకున్నా వాటిని కడుక్కో-
లనేధ్యాసే వుండేదికాదు నీకు నీకూ తెలుసు అది అం
రోగమని జాగ్రత్తగా వుండాలనీ కాని ఆసంగతి సమయా
నికి మర్చిపోతూవుండేవాడివి ఇప్పుడు నీ ప్రేమ ఎక్కువ
ఆయనప్రేమ ఎక్కువా అని పోల్చిచూడటంలేదు నే
ఏమిటో మనస్సులో బాధగావుంటే నీకు వుత్త
వ్రాస్తున్నా అన్నట్టు అన్నయ్యా ఈ సంక్రాంతికి
బహుమానం పంపుతావు నాకు? బహుశా ఇదే ఆఖ
సంక్రాంతేమో నా జీవితానికి

అన్నయ్యా! ఈ ఉత్తరాన్ని నీ కెక్కడికి పం
చేయను ? నువ్వు చచ్చిపోయావుకదన్నయ్యా!!